# AMERICA'S LEADING CHILDREN'S MAGAZINES ARE NOW IN INDIA.

Spark your child's imagination with America's most-loved children's magazines. **Highlights™ Genies** and **Highlights™ Champs** not only help children develop a lifelong love of reading, they also help instill the confidence and values kids need to become their "best selves".




Ages 6-12 Years

- **Hidden Pictures**™ scenes and other puzzles
- Wide variety of stories and articles
- Hands-on crafts and activities


Ask Arizona™


Goofus & Gallant™


The Timbertoes™




Ages 2-6 Years

- Read-aloud stories and rhymes
- **My First Hidden Pictures**™ puzzles
- Simple counting games and activities


Spot™


Tex & Indi™


Bert & Beth™

Brought to you by CHAMPAK

**Highlights CHAMPS**

SUBSCRIBE TODAY!
www.delhipress.in/highlightschamps

**Highlights Genies**

SUBSCRIBE TODAY!
www.delhipress.in/highlightsgenies

For advertising, contact: North - Anand @9810871459, Alok @ 9810332675,
South - Koushik @ 9844185412 (Karnataka & Kerala), Mageshwar @9940173454 (Tamil Nadu & Andhra Pradesh ),
East - Indranil @ 9830186037, West - Deepak @ 9819762622, Email- advertising@delhipress.in

# చంపక్

డిసెంబర్ 2017 సంచిక - 222

వ్యవస్థాపకులు
విశ్వనాథ్
1917 - 2002



## కథలు



## ముఖ చిత్రం

జయ్ ఒక కొత్త నక్షత్రాన్ని కనిపెట్టాడు.




## మనో వికాస శీర్షికలు



## చిత్ర కథలు



## వినోదం విజ్ఞానం



ఎడిటర్ & పబ్లిషర్ ● పరేష్ నాథ్

CHAMPAK TELUGU, DECEMBER 2017
ప్రధాన సంపాదకీయ కార్యాలయం & వ్యాపార ప్రకటనలు, ప్రచురణ కార్యాలయం : ఢిల్లీ ప్రెస్ భవన్, ఇ-8 ఝండేవాలా స్ట్రీట్, రాణీ ఝాన్సీరోడ్, న్యూఢిల్లీ 110 055
ఫోన్ : 23529557 - 62 ఫ్యాక్స్ : 011 -23625020
స్థానిక సంపాదకీయ కార్యాలయం : 122, చెనాయ్ ట్రేడ్ సెంటర్, 116 పార్క్‌లేన్, సికింద్రాబాద్ - 500 003
ఫోన్ నెం. : 27896947, e -mail : grihshobha.hyderabad@delhipress.biz
ఢిల్లీ ప్రెస్ పత్ర ప్రకాశన్ ప్రైవేట్ లిమిటెడ్ కోసం ప్రచురణ, ముద్రణకర్త పరేష్‌నాథ్ ద్వారా పీఎస్ పీసీ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్, డీఎల్ఎఫ్ - 50, ఇండస్ట్రియల్ ఏరియా, ఫరీదాబాద్, హర్యాణా - 121003 : ఢిల్లీ ప్రెస్, ఇ-8, జండేవాలా ఎస్టేట్, న్యూఢిల్లీలలో ముద్రణ, ఇ-8 ఝండేవాలా ఎస్టేట్, న్యూఢిల్లీ నుంచి ప్రచురితం.


***Editor, Publisher and Printer : PARESH NATH***
Printed at PS PC Press Pvt. Limited, DLF-50, Industrial Area, Faridabad, Hariyana-121003, And Delhi Press, E-8, Jhandewala Estate, New Delhi - 110055 And published on behalf of Delhi Press Patra Prakashan PTE Ltd., E-8, Jhandewala Estate, New Delhi - 110055.
www. facebook.com/ChampakMagazine

ధర : కాపీ ఒకటి రూ. 25/-లు
సంవత్సర చందా : 249 రూపాయలు,
2 సంవత్సరాలకు : 438 రూపాయలు,
3 సంవత్సరాలకు : 621 రూపాయలు.



# దురాశకు తగిన శిక్ష

కథ ● డా॥ కె.రాణి

టైసీ పిల్లి చాలా చాతుర్యం కలిగింది. మంచి మాటకారి కూడా. ఎవరైనా తనను ఒక్కసారి కలిస్తే పదే పదే కలవాలనిపించేది. అది దుస్తులు ధరించి ఉదయాన్నే బయల్దేరి, అడవిలోని జంతువులను కలిసి మాట్లాడుతుండేది. ఆ రోజు అందరికంటే ముందు అది బేరీ కాకిని కలిసింది.

బేరీ తనతో 'టైసీ, ఎలా ఉన్నావు?' అంది.

'నేను బాగున్నాను. కానీ నిన్ను చాలా రోజుల తర్వాత చూస్తున్నాను.'

'అవును. నేను బయటకు వెళ్లాను.'

'నీ పని ఎలా నడుస్తోంది?'

'చాలా బాగుంది'

'ఓహ్ అసలు నువ్వు చేసే పని ఏంటో కూడా నాకు తెలియదు?'

'నాకు సొంత వ్యాపారం ఉంది.'

'నీ పనులన్నీ నువ్వే చూసుకుంటావా?'

'అవును. నేనే చేసుకుంటాను' అన్నాడు బేరీ. ఆ తర్వాత ఇద్దరూ బేరీ పని గురించి మాట్లాడుకోసాగారు. అక్కడి నుంచి టైసీ బయల్దేరగానే బేలా ఆవు కనిపించింది. తన అలవాటు ప్రకారం టైసీ బేలాను కూడా పలకరించింది. 'బేలా నిన్ను చూసి నాకు చాలా సంతోషంగా ఉంది' అంది.

'నాకు కూడా నిన్ను చూసి ఆనందం కలుగుతోంది' అంది బేలా.

'నీ కొడుకు ఎలా ఉన్నాడు? అతని వయసెంత?'

'బాగున్నాడు. చీనూకి ఇప్పుడు మూడేళ్లు. అతడు కూడా ఉదయాన్నే నాతో గడ్డి మేసేందుకు వస్తాడు.'



'వాహ్, ఇది చాలా మంచి విషయం. మంచి ఆహారం చాలా అవసరం.'

'అవును, నువ్వు చెప్పేది నిజం. చీనూ కారణంగానే ఇంట్లో చాలా పాలు ఉంటున్నాయి.'

'అంటే మీ ఇంట్లో నేను తాగడానికి కూడా పాలు ఉండొచ్చు?'

'అవును. నీకు కూడా స్వాగతం. ఎప్పుడు కావాలన్నా రావచ్చు.'

'ఇంకేంటి సంగతులు? నువ్వు గడ్డి మేస్తూ ఉండు. నేను నీకు తోడుగా నడుస్తాను' అంది ట్రైసీ. ఆ తర్వాత ఇద్దరూ మాట్లాడుకోసాగారు.

కాసేపటి తర్వాత ఇద్దరూ బేలా ఇంటికి వెళ్లారు. బేలా కుటుంబీకులు కూడా ట్రైసీకి స్వాగతం చెప్పారు. ట్రైసీ కడుపునిండా స్నాక్స్ తిని, పాలు కూడా తాగి ఆనందించింది. చాలాసేపు అక్కడ ఉండి ట్రైసీ తన ఇంటికి బయల్దేరింది. వెళ్తూ వెళ్తూ బేలాతో మళ్లీ వస్తానని చెప్పింది.

ట్రైసీ రోజులు ఆనందంగా గడుస్తున్నాయి. అది ఇదే విధంగా రోజంతా తిరుగుతూ సాయంత్రానికి ఇంటికొచ్చేది.

ట్రైసీ ఒంటరిగా ఉంటూ, అడవిలోని అమాయక జంతువుల నుంచి లాభం పొందుతోందని బేరీకి అనిపించింది. ట్రైసీ ఎంతో దర్పంగా ఉంటూ ప్రతిరోజూ ఏదో ఒక జంతువు నుంచి లాభం పొందుతోంది.

మరుసటి రోజు ఉదయం ట్రైసీ తయారై బయల్దేరగా అది తన ఇంటి ముందున్న చెట్టుపై బేరీ కాకిని చూసింది.

'ఈ సమయంలో నువ్వు ఇక్కడ ఉన్నావా?' అంది.

'నేను ఇక్కడి నుంచి వెళ్తూ, నిన్ను కలవాలని ఆగాను.'

'ఓహో ఇదైతే మంచి విషయమే.'

'మరైతే నిన్నటి పార్టీ ఎలా గడిచింది?'

'పార్టీ ఏమిటి?'

'అవును. బేలా ఇంట్లో నువ్వు చాలా ఆనందించావని నాకు అనిపిస్తోంది.'

'బేలా చాలా మంచిది. కానీ నీకెలా తెలుసు? నువ్వు నన్ను వెంబడిస్తున్నావా?'

'ఏంటి అలా అంటావు? నేను నా స్నేహితులు లేదా శత్రువులపై ఎప్పుడూ కన్నేసి ఉంటానా?'

'నువ్వు నన్ను స్నేహితురాలిగా భరించటం చాలా సంతోషం.'

'చూడు మనిద్దరి అలవాట్లు ఒకేలా ఉంటాయి. తీయగా మాట్లాడి మనం పరిస్థితి నుంచి లాభం పొందుతాం.'

ట్రైసీ కాసేపు మౌనం వహించింది. బేరీని ఆట



పట్టించటం సులభం కాదనుకుంది. కాసేపు ఆలోచించి 'బేరీ మనమిద్దరం కలిసి ఏదైనా కొత్తది చేయొచ్చు కదా?' అంది.

'నీ మనసులో ఏముంది?'

'ఏమిటంటే ఇద్దరం కలిసి చాలా బాగా చేయొచ్చు. నేను తీయగా మాట్లాడి వలలో వేసుకుంటాను. నువ్వు నీ పని చేసెయ్యాలి.'

'నువ్వు సరిగ్గా చెప్పావు. మరైతే ఇవాళ్టి నుంచే పని మొదలుపెడదాం.'

ఆ తర్వాత వారిద్దరూ అక్కడి నుంచి ఎవరైనా వెళ్తారని ఎదురుచూస్తున్నారు. అప్పుడే డానీ గాడిద కనిపించాడు. టైసీ అతన్ని ఆపి 'ఎలా ఉన్నావు డానీ' అంది.

'నేను ఇలాగే ఉన్నాను? నాకేమైంది?'

'నేనైతే నిన్ను చాలా రోజుల తర్వాత చూస్తున్నాను. నువ్వు చాలా బలహీనంగా కనిపిస్తున్నావు.'

'లేదు లేదు, చాలా ఆరోగ్యంగానే ఉన్నాను.'

'టైసీ చెప్తోంది నిజమే డానీ' అప్పుడు బేరీ మధ్యలోకి వచ్చి 'నువ్వు అప్పటికంటే బలహీనంగా కనిపిస్తున్నావు' అన్నాడు.

డానీ కూడా భయపడ్డాడు. అతడు తల కిందకేసుకుని చూసుకున్నాడు. కానీ ఎలాంటి మార్పు కనిపించట్లేదు. ఆ తర్వాత ఏదో ఆలోచిస్తూ 'ప్రస్తుతం అందరూ నీరసంగానే ఉంటున్నారు. నేను కొంచెం ఎక్కువ తగ్గినట్లున్నాను' అన్నాడు.

'ఇప్పుడు నిజం చెబుతున్నావు. కానీ ఇలాంటప్పుడు మనం డాక్టర్ దగ్గరికి వెళ్ళాలి.'

'సరే ఆలోచిస్తాను.'

'ఆలోచించేది ఏమిటి? నువ్వు ఆరోగ్యాన్ని పట్టించుకోవట్లేదు. నాకు ఒక మంచి డాక్టర్ తెలుసు. నీకు కావాలంటే ఇప్పుడు అక్కడికి వెళ్దాం.'

'దీని గురించి ముందుగా ఇంట్లో మాట్లాడుతాను.'

'సరే నీ ఇష్టం. కానీ ఎక్కువగా ఆలస్యం చేయొద్దు. నీ దగ్గర డబ్బు కూడా ఉంది. నువ్వు అన్నీ వదిలి ముందు డాక్టర్ దగ్గరికి వెళ్లాలి' అన్నాడు బేరీ.

చివరికి డానీ వారితో వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు. నగరానికి వెళ్ళి అన్నింటికంటే ముందు వారొక రెస్టారెంట్లో భోజనం చేసారు. ఆ తర్వాత డాక్టర్‌కు చూపించారు. రోజంతా నగరంలో సరదాలు చేసుకుని సాయంత్రం తిరిగొచ్చారు. డానీ మెడికల్ రిపోర్టులో అన్నీ మామూలుగానే ఉన్నాయి. డానీ భార్య ఇంట్లో దిగులుగా అతని కోసం ఎదురుచూస్తూ ఉంది.

'నువ్వు ఎక్కడున్నావు?' అడిగింది భార్య. డానీ

అంతా చెప్పాడు. భార్య కోపంగా 'నువ్వు వారితో వెళ్ళేందుకు ఎలా సిద్ధమయ్యావు? నువ్వు ముందుగా ఇంటికి రావాలి కదా డానీ' అంది.

'కానీ వారు పట్టుపట్టడంతో నేను వాదించలేకపోయాను.

'ఇప్పుడేం చేయాలి?'

'వారు మన ఏడాది పొదుపు డబ్బును ఒక్క రోజులో సమాప్తం చేసారు. వారికి తప్పకుండా గుణపాఠం నేర్పాలి.'

'అదెలా చేయగలం?'

'నువ్వు వారిని ఇంటి వరకు తీసుకురా. మిగిలిందంతా నేను చూసుకుంటాను.'

'సరే ప్రయత్నిస్తాను' అంటూ డానీ వారిని వెతుక్కుంటూ అడవి వైపు బయల్దేరాడు.

అతడు రోజంతా ఎదురుచూసాడు. చివరికి అతనికి టైసీ కనిపించింది. డానీని చూడగానే టైసీ అటు తిరిగి వెళ్ళిపోయే ప్రయత్నం చేసింది.

డానీ తనను పిలిచి 'నేను నీ కోసమే ఎదురుచూస్తున్నాను టైసీ.'

'నాతో ఏమైనా పనుందా?'

'నేను మీ ఇద్దరికీ ధన్యవాదాలు తెలపాలనుకుంటున్నాను. నేను మీ గురించి నా భార్యకు కూడా చెప్పాను. ఆమె కూడా మీలాంటి స్నేహితులను కలవాలనుకుంటోంది.'

'అవునా.'

'అవును. నా భార్య మీ ఇద్దరి కోసం ఒక చిన్న పార్టీ ఏర్పాటుచేసింది. బేరీ ఎక్కడ ఉన్నాడు? అతనికి ఇప్పుడే ధన్యవాదాలు తెలపాలని ఉంది.'

'నువ్వు చింతించకు. నీ సందేశాన్ని అతనికి చేరవేస్తాను.'

'నువ్వు చాలా మంచిదానివి టైసీ. నేనే రేపు మిమ్మల్ని కలవడానికి మళ్లీ వస్తాను' అనేసి డానీ వెళ్ళిపోయాడు. టైసీ వెళ్ళి విషయమంతా బేరీకి చెప్పింది.

బేరీ సంతోషంతో 'నాకైతే నమ్మశక్యంగా లేదు టైసీ. మనమిద్దరం రేపు డానీ పార్టీకి తప్పక వెళ్దాం.'

వారు రేపు వస్తారు కనుక గుణపాఠం చెప్పేద్దాం అనుకున్నారు.

ముందటి ప్లాన్ ప్రకారం డానీ మరుసటి రోజు వారిద్దరినీ పార్టీ కోసం ఇంటికి పిలిచాడు. డానీ భార్య వారికి స్వాగతం పలికి అనేక తినుబండారాలను వారి ముందు వడ్డించింది. పార్టీ చాలా గంటల వరకు నడిచింది. తిన్న తర్వాత ఇద్దరికీ నిద్ర వచ్చింది. వారు అక్కడే పడుకున్నారు.



ఉదయం టైసీ నిద్ర లేవగానే గంట శబ్దం వినిపించింది. చూసుకుంటే మెడలో గంట కట్టి ఉంది. ఎంత తీసేందుకు ప్రయత్నించినా వీలు కాలేదు.

ఇప్పుడు టైసీకి ఆందోళనగా ఉంది. కొంచెం కదిలినా గట్టిగా గంట వినిపిస్తోంది. అది ఒక

అదే రాత్రి టైసీ గంటను నొక్కి పట్టుకుని అడవి నుంచి బయటికి వెళ్ళిపోయింది. ఒక లోహ కార్మికుడితో గంట కట్ చేయించుకుంది. ఆ తర్వాత టైసీ ఎన్నడూ అడవివైపు తిరిగి చూడలేదు.

బేరీ పరిస్థితి మరింత బాధగా ఉంది. ఆ






చేతిలో గంట పట్టుకుని నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది.

అప్పుడే బేరీ కూడా నిద్ర లేచాడు. అతడు చెట్ల పొదలో ఇరుక్కున్నాడు. రెక్కలు కూడా ఆడించలేకపోయాడు. రెక్కలకు ఏమైందో అర్థం కాలేదు. ఏమీ చేయలేక మౌనంగా కూర్చుండిపోయాడు.

ఇదంతా డానీ భార్య చేసిన కుట్ర అని వెంటనే టైసీ, బేరీకి అర్థమైపోయింది. ఇప్పుడు టైసీ, బేరీ తమ మూర్ఖత్వంతో ఇరుక్కుపోయారు. ఎవరినీ సహాయం కూడా అడగలేకపోతున్నారు. ఎందుకంటే దీంతో ఇంకా అవమానం కలుగుతుంది.

పొదల్లో తిండి, నీళ్ళు ఏమీ అందట్లేదు. గోగో ఉడుత ఆహారం వేటలో అటు వెళ్తోంది. దాని చూపు పొదలపై పడింది. వెంటనే గోగో బేరీకి నీళ్ళు తాగించి, రెక్కలు సరిచేసాడు. బేరీకి స్పృహ వచ్చింది కానీ ఏమీ మాట్లాడలేకపోయాడు.

గోగో వెళ్ళిపోయాక బేరీ ఏదోలా లేచి, ముందున్న చెట్టు దగ్గర కూర్చున్నాడు. మరుసటి రోజు అతడు కూడా అడవి వదిలి వెళ్ళిపోయాడు.

డానీ, అతని భార్య టైసీ, బేరీల దురాశకు తగిన శిక్ష పడిందని చాలా సంతోషించారు. ఇద్దరూ అడవిలో అమాయక జంతువులను మోసపోకుండా కాపాడారు. ●



# బొమ్మను పూర్తి చేయండి

డిసెంబర్ 3న అంతర్జాతీయ దివ్యాంగుల దినోత్సవం. కింది చిత్రంలో కొన్ని భాగాలు ఖాళీగా ఉన్నాయి. ఎడమవైపున్న చిత్రాన్ని చూసి బొమ్మను పూర్తి చేయండి, రంగులు నింపండి.

# సోహమ్‌కు సహాయం చేయండి

సోహమ్ వీడియో గేమ్ ఆర్కేడ్‌లో తన ఫేవరెట్ గేమ్ స్పేస్ ఇన్‌వేడర్స్ ఆడాలనుకున్నాడు. సరైన మిషన్ కనిపెట్టడానికి అతనికి సహాయం చేయండి.




- ఆ గేమ్ బ్లూ మెషిన్‌లో ఆడతారు.
- ఆ మెషిన్‌కు జాయ్‌స్టిక్ లేదు.
- మెషిన్, బటన్స్ ఒకే కలర్‌లో ఉన్నాయి.

జవాబులు చివరి పేజీలో చూడండి.





# ష్... నవ్వొద్దు... హహ్హహ్హ

సియా (రియాతో) : చిన్న విషయాలే ఎక్కువగా బాధ కలిగిస్తాయి.
రియా : అదెలా?
సియా : నువ్వు పర్వతంపై హాయిగా కూర్చోగలవు, కానీ సూదిపై కూర్చోలేవు.

- అమీషా కుమారి,
16 సంవత్సరాలు, పూణె

మెహక్ (ధ్రువ్‌తో) : ప్రపంచంలో అత్యంత పురాతన జంతువులు ఏవి?
ధ్రువ్ : కంచర గాడిద.
మెహక్ : ఎందుకు?
ధ్రువ్ : ఎందుకంటే వాటి రంగు ఇంకా బ్లాక్ అండ్ వైటే కదా.

- మెహక్ గులేచా,
7 సంవత్సరాలు, చెన్నై

సురేష్ (చందన్‌తో) : సూర్యుడు పొద్దున్నే ఉదయిస్తాడు ఎందుకూ
చందన్ : ఎందుకంటే రాత్రి ఉదయించలేడు కనుక.

- అహానా రాథీ,
7 సంవత్సరాలు, న్యూఢిల్లీ

టీచర్ (రాహుల్‌తో) : నీ పుస్తకం ఎందుకు అంత పాతగా ఉంది?
రాహుల్ : ఎందుకంటే ఇది నా చరిత్ర పుస్తకం.

- గౌరీ సమంత్,
10 సంవత్సరాలు, ముంబై

ముస్కీ ఒక అమ్యూజ్‌మెంట్ పార్కుకు వెళ్ళింది. అక్కడ ఒక సీల్డ్ రూమ్‌లోకి అడుగు పెట్టింది.
స్టాఫ్ సభ్యుడు : నీకు ఇక్కడ 'ప్రవేశం లేదు' అనే బోర్డు కనిపించ లేదా?

హహ్హహ్హ
హహ్హహ్హ హహ్హహ్హ హహ్హహ్హ

ముస్కాన్ (అనురాగ్‌తో) : ఆవులు వాటి హెడ్ ఫోన్స్‌లో ఏమి ఉంటాయి?
అనురాగ్ : మూ... సిక్ (మ్యూజిక్).

- అనన్యా షా, 6 సంవత్సరాలు,
ముంబై

ముస్కీ : నాకు ఇప్పుడు స్కూల్ సెలవులు మొదలయ్యాయి. అందుకే నేనేమీ చదవను.

- పయల్ మండల్,
12 సంవత్సరాలు, పశ్చిమ బెంగాల్

రమేశ్ (అశ్వినితో) : నువ్వు గుడ్డు మీద జోక్స్ చెప్పవెందుకు?
అశ్విని : ఎందుకంటే అది నవ్వి నవ్వి పగిలి పోతుంది.

- సృష్టి యాదవ్,
12 సంవత్సరాలు, గుజరాత్

శ్యామ్, రామ్‌లు స్టోర్‌కు వెళ్లారు. శ్యామ్ మూడు చాక్లెట్లు దొంగిలించాక, ఇద్దరూ వెళ్ళిపోయారు.
శ్యామ్ : నేను చాలా తెలివైనవాడిని. నేను మూడు చాక్లెట్లు దొంగిలించినా ఎవరూ పసిగట్టలేదు.
రామ్ : నేను ఇంకా మంచిగా చేయగలను.
వాళ్ళిద్దరూ మళ్లీ స్టోర్‌కు వెళ్లారు.
రామ్ (దుకాణదారునితో) నేను మీకొక మ్యాజిక్ ట్రిక్ చూపిస్తాను.
దుకాణదారుడు : సరే చూపించు.
రామ్ : దయచేసి, నాకు మూడు చాక్లెట్లు ఇవ్వండి.
దుకాణదారుడు : మూడు చాక్లెట్లు ఇవ్వగా రామ్ అన్నీ తినేసాడు.
దుకాణదారుడు : ఇందులో ట్రిక్ ఏముంది?
రామ్ : ఇప్పుడు శ్యామ్ ప్యాకెట్‌లో చూడండి. మీ చాక్లెట్లు మీకు దొరుకుతాయి.

- సాక్షి ఉల్లాల్,
8 సంవత్సరాలు, మంగళూర్

వివేక్ (డాడీతో) : డాడీ మీరు పర్సు పోగొట్టుకోలేదు కదా?
డాడీ : లేదే.
వివేక్ : సరిగ్గా చెక్ చేసుకోండి.
డాడీ (జేబులో చేయి పెట్టుకుని) : లేదు, నా పర్సు జేబులోనే ఉంది.
వివేక్ : మరైతే 10 రూపాయలు ఇవ్వండి డాడీ.

- అశ్వినీ కుమార్,
11 సంవత్సరాలు, మంగళూర్

మీరు రాసిన పొడుపు కథలు, తెలిసిన చిట్కాలు, గీసిన బొమ్మలు మీ పేరు, వయసు, చిరునామా, ఫోన్ నెంబర్ తెలియజేస్తూ మాకు పంపించండి :
'చంపక్', ఢిల్లీప్రెస్, ఎ-4, శ్రీరామ్ ఇండస్ట్రియల్ ఎస్టేట్, వడాలా, ముంబై-400031.
ఇ మెయిల్ : writetochampak@delhipress.in,
SMS: 9619587613
ఆన్‌లైన్‌లో చూడండి : www.facebook.com/ChampakMagazine
https://www.youtube.com/ChampakSciQ







# డమరూ, హోంవర్క్

కథ ● శివేష్ శ్రీవాత్సవ్

ఈసారి డమరూకి ఫోరీ నక్క వద్ద పని దొరికింది.

డమరూ, నేను రేపు మా బాబు ఫెలిక్స్ చదివే స్కూల్‌కి పీటిఎంకు వెళతాను. అతని హోంవర్క్ సమయానికి చేసేలా జాగ్రత్తగా చూడు.

హోంవర్క్ అంటే ఏమిటి?

నేనిప్పుడు వెళుతున్నాను. రాత్రికి తిరిగొస్తాను. హోంవర్క్ గురించి మరిచిపోకు.

డమరూ వెంటనే జుమరూ కోతి దగ్గరికి వెళ్లాడు.

జుమరూ, హోంవర్క్ అంటే ఏమిటి?

హోం అంటే నీ ఇల్లు, వర్క్ అంటే పని.

ఓ! ఇప్పుడు నాకు అర్థమైంది.

ఫెలిక్స్, నువ్వు నీ హోంవర్క్ పూర్తి చేసావా?

డాడీ, డమరూ నాతో ఇంటిపనంతా చేయించాడు.

డమరూ, నువ్వు నా కొడుకుతో ఇంటి పనంతా ఎందుకు చేయించావు?

మీరే కదా హోం వర్క్ అంతా చేయించాలని చెప్పారు.

నేను చెప్పిన దానికి అర్థం స్కూల్‌లో ఇచ్చిన పనిని ఇంట్లో చేయమని.

మీరు ముందే చెప్పాల్సింది.

నీ సంగతి చెబుతాను. నువ్వు నా కొడుకుతో ఇంట్లో పని చేయించే ధైర్యం ఎలా చేసావు?

నేను వెళ్ళిపోతాను. మీ బాబుకు హోంవర్క్ గురించి బాగా తెలుసు.

ఇలా రా ఫెలిక్స్, కలిసి నీ హోంవర్క్ చేద్దాం.

SONAL & SUMIT



# పంచుకోవటంలోని ఆనందం

కథ ● రేణుకా శ్రీవాత్సవ్

ఒక రోజు పీహూ తన పొరుగింటి చున్మున్ ఒక బొమ్మతో ఆడుతుండటం చూసాడు. తనతో 'నన్ను కూడా నీ బొమ్మలతో ఆడనిస్తావా?' అన్నాడు.

చున్మున్ బదులిస్తూ 'అసలు వద్దు. నేను బొమ్మలు ఇవ్వను. అవి మురికి పట్టేస్తాయి. నువ్వు నీ బొమ్మలు తెచ్చుకోవచ్చు కదా!'

'నా దగ్గర అసలు లేవు' పీహూ బాధగా చెప్పాడు.

'ఒక్కటి కూడా లేదా. అలాగైతే అసలు ఆడను' చున్మున్ పొగరుగా చెప్పింది.

'సరే నేను అదాతోనే ఆడుకుంటాను. ఆమె తన బొమ్మలు నాకూ ఇస్తుంది' అంటూ పీహూ వెళ్ళిపోయాడు.

'నా బొమ్మలు చాలా బాగుంటాయి' అంది చున్మున్.

పీహూ కాసేపటి తర్వాత తిరిగొస్తాడని చున్మున్ అనుకుంది. కానీ అలా జరగలేదు. చున్మున్ అక్కడి నుంచి వెళ్లిపోవాలనుకుంది. అప్పుడు తన మిత్రులు కోనికా, సూరజ్, రోహన్, కోమల్, పీహూ, అదా అందరూ కలిసి ఆడుకోవటం గమనించింది. చున్మున్‌కు చాలా బాధ కలిగింది. ఎవ్వరూ తనను ఆడటానికి పిలవలేదు.

చున్మున్‌కు తన ఖరీదైన ఆటవస్తువులు, బొమ్మలు చూసుకుని గర్వంగా ఉండేది. తన దగ్గర ఖరీదైన మంచి బొమ్మలు ఉన్నందుకే పిల్లలంతా వస్తుంటారనుకునేది. కానీ తన దగ్గరికి ఎవరూ

రాకపోవటంతో ముఖం ముడుచుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

'మమ్మీ ఎవరూ నాతో ఆడటం లేదు. అందరికీ నా ఖరీదైన బొమ్మలంటే చాలా అసూయ' అంది చున్‌మున్.

'పిల్లలు నువ్వంటే అసూయ పడితే నువ్వు అక్కడికి ఎందుకు వెళ్తున్నావు?' అడిగింది మమ్మీ.

'నేను ఎందుకు వెళ్లకూడదు? మేమంతా ఒకే వయసువాళ్లం. వారికి నాతో ఆడటానికి ఇబ్బంది ఏమిటి' అంది చున్‌మున్.

'నీ వస్తువులు ఇతరులకు ఇవ్వటం నీకు ఇష్టం ఉండదు. అలాగే వారికి కూడా నీతో ఆడుకోవటం వారికి ఇష్టం ఉండకపోవచ్చు' మమ్మీ నచ్చచెప్పేందుకు ప్రయత్నించింది.

'మమ్మీ నువ్వు వారినే సమర్థిస్తున్నావు. ఫో, నేను నీతో మాట్లాడను' చున్‌మున్ కోపంగా అంది.

'చూడు చున్‌మున్ ఏదైనా ఇతరులతో పంచుకోవటం ఎలాగో నువ్వు నేర్చుకోవాలి' అంటూ మమ్మీ 'నువ్వు ఇతర పిల్లలతో ఆడితే టీంతో ఆడటం ఎలాగో తెలుస్తుంది. నువ్వు నీ వస్తువులతో ఆడటం వల్ల ఎవరూ అసూయపడటం లేదని నీకు అర్థమవుతుంది' వివరించింది మమ్మీ.

'లేదు, నేను ఎవరితోనూ బొమ్మలు షేర్ చేసుకోలేను' చున్‌మున్ చిరాకు పడింది.

'మరైతే ఇతరులు కూడా నీతో ఆడతారన్న నమ్మకం పెట్టుకోవద్దు' అంది మమ్మీ.

చున్‌మున్ ఒంటరిగానే ఆడుతోంది, కానీ బయట ఆడుతున్న పిల్లల గురించే ఆలోచిస్తోంది. ఆమె కిటికీ దగ్గరికి వెళ్ళి వారిని చూడసాగింది. ఆమె బయటికి వెళ్ళి మళ్లీ ప్రయత్నం చేసింది. కానీ ఎవరూ తనవైపు చూడలేదు.

కాలనీలో పిల్లలంతా కలిసి ఆడేవారు. వారి మధ్య విభేదాలు లేవు. అందరు సహాయం చేసుకునేవారు.



చున్‌మున్‌కు ఇంట్లో చాలా గారాబం చేసేవారు. ఇంట్లో ఇంకెవరూ చిన్నారులు లేరు. చున్‌మున్ ఎక్కువసేపు తల్లిదండ్రులతోనే మాట్లాడుతుండేది. చున్‌మున్ అంతకుముందు ఉన్న చోట ఎవరూ తన వయసు వారు లేరు. తాను ఒంటరిగా ఉంటుండేది. అందుకే మమ్మీ, డాడీలు ఆమెకు నచ్చిన ఖరీదైన బొమ్మలన్నీ కొనిచ్చేవారు. చున్‌మున్ ఎప్పుడైనా ఇతర పిల్లలతో ఆడలేదు. అందుకే ఇతర పిల్లలతో ఎలా నడుచుకోవాలో తెలియదు.

ఈ సొసైటీలో చాలామంది పిల్లలున్నారు, వారితో స్నేహం చేయాలని మమ్మీ ఎన్నిసార్లు చెప్పినా చున్‌మున్ వినేది కాదు.

ఒక రోజు చున్‌మున్ ఇంట్లో ఒంటరిగా ఉంది. టెర్రస్ పైకి వెళ్ళి చూడగా కొందరు పిల్లలు ఆడుకుంటుండటం గమనించింది. అప్పుడే కోతుల గుంపు అక్కడికి వచ్చింది.

చున్మున్ భయపడింది. కిందికి వెళ్లాలనుకుంది. వెనక్కి తిరగగానే ఒక పెద్ద కోతి అడ్డుగా నిలబడింది. గట్టిగా కేకేయటంతో కోతి భయపడి ఎంతో వేగంగా పరుగు తీసింది.

చున్మున్ భయంతో గట్టిగా ఏడవసాగింది. ఆమె గొంతు విని కింద ఆడుతున్న పిల్లలు పైకి చూసారు.

సోహన్ కేకేసి 'అటు చూడండి, టెర్రస్‌పై చున్మున్ ఒంటరిగా నిల్చుంది' అన్నాడు.

అప్పుడు సూరజ్ 'మనమంతా వెళ్ళి ఆమెకు సహాయం చేయాలి. త్వరగా వెళ్లండి, మనం కునాల్ ఇంటి నుంచి టెర్రస్‌పైకి వెళ్లొచ్చు' అన్నాడు.

పిల్లలందరూ కునాల్ ఇంటివైపు పరుగెత్తారు. అందరి చేతిలో బ్యాట్స్, బ్యాడ్మింటన్ రాకెట్స్ ఉన్నాయి. పిల్లలు, కునాల్ టెర్రస్‌పైకి చేరగానే కేకలతో కోతులను తరమటం మొదలుపెట్టారు.

చున్మున్ భయంతో ఒక మూలన కూర్చుంది. కోతులు వెళ్లిపోగానే ఆమె పరుగెత్తి కోనిక దగ్గరికి వెళ్ళి ఏడవసాగింది. కోనిక ఆమె కన్నీరు తుడిచి ఓదార్చింది. చున్మున్ శాంతించేదాకా పిల్లలంతా ఆమె దగ్గరే నిల్చున్నారు.

చున్మున్ మమ్మీ, డాడీలు తిరిగొచ్చాక ఇంట్లో పిల్లలందరు ఉండటం చూసి కంగారుపడ్డారు.

చున్మున్ మమ్మీ వారితో 'ఏమైంది? అంతా బాగానే ఉంది కదా?' అంది.

అప్పుడు రోహన్ 'ఆంటీ అంతా బాగానే ఉంది. చింతించాల్సిన విషయం ఏమీ లేదు' అన్నాడు.

చున్మున్ మమ్మీకి హత్తుకుపోయింది. పిల్లలంతా అక్కడి నుంచి వెళ్లబోతుండగా చున్మున్ 'నా దుష్ప్రవర్తనకు మీరు నన్ను దయచేసి క్షమించండి. నాకు చాలా సిగ్గుగా ఉంది. మీరు వెళ్లిపోయే ముందు ఒకసారి మా ఇంట్లోకి రండి. ఏదైనా తిన్నాకే వెళ్లండి' అంది.

పిల్లలు సరేనంటూ తలూపారు. ఇప్పుడు చున్మున్ మునుపటిలా ప్రవర్తించటం లేదని పిల్లలు గమనించారు. కొద్దిసేపటికే మమ్మీ హల్వా చేసి తీసుకొచ్చింది. అందరూ సంతోషంగా హల్వా తిన్నారు.

చున్మున్ పీహూ దగ్గరికి వెళ్ళి 'నేను కూడా మీతో ఆడవచ్చా?' అంది.

'ఎందుకు ఆడకూడదు? నువ్వు ఇందుకోసం ఎవరినీ అనుమతి తీసుకునే అవసరం లేదు. మనమంతా కలిసే ఆడుకుందాం' కోనిక చిరునవ్వుతో చెప్పింది.

మరుసటి రోజు చున్మున్ తనకు ఇష్టమైన బొమ్మలతో పీహూ దగ్గరికి వచ్చి 'పీహూ నువ్వు ఈ బొమ్మలు తీసుకుని అదాతోపాటు ఆడుకోవచ్చు. నేను కోనికతో కలిసి ఆడుకుంటాను' అంది.

పీహూ ఏమీ చెప్పకముందే చున్మున్ అక్కడి నుంచి వెళ్ళిపోయింది. ఇప్పుడు చున్మున్‌కు స్నేహితుల విలువ తెలిసొచ్చింది. కొద్దికాలంలోనే చున్మున్ అందరికీ ఇష్టమైన ఫ్రెండ్ అయిపోయింది. ●



ఆసక్తికర విజ్ఞానం

# గ్లాసులో ఆకాశం

ఒక గ్లాసు నీటిలో మొదట నీలం, తర్వాత ఆరెంజ్ రంగు ఆకాశం రూపొందించండి.

## మీకు కావలసినవి :

- ఒక పారదర్శక గ్లాస్
- కొన్ని పాలు
- నీళ్లు
- టార్చ్ (తెల్ల లైటు)
- చీకటి గది.



## ఇలా చేయండి :

1. ఒక గ్లాసును నీటితో నింపండి. ఇందులో కొద్ది కొద్దిగా పాలు కలుపుతూ నీళ్లన్నీ పాలలా అయ్యేలా చూడండి.



2. గ్లాసును చీకటి గదిలోకి తీసుకెళ్ళి టేబుల్‌పై పెట్టండి.



3. గ్లాస్‌కు ఒకవైపు నుంచి టార్చ్ వెలిగించండి. గ్లాస్‌లోని పాలు కలిపిన నీళ్లను చూడండి.



4. గ్లాస్‌ను పైకి ఎత్తి అడుగు భాగం నుంచి టార్చ్ వెలిగించి, గ్లాస్‌పై నుంచి పాలు కలిపిన నీళ్ల రంగు చూడండి.



## చూడండి :

గ్లాసు చివరి నుంచి టార్చ్ వెలిగించి నప్పుడు పాల నీళ్లు నిదానంగా, నీలంగా మారిపోతాయి. టార్చ్‌ని అడుగు నుంచి వెలిగిస్తే నీళ్లు లేత ఆరెంజ్ రంగులో కనిపిస్తాయి.



## ఆలోచించండి :

**అడుగు రంగు ఎలా మారుతుంది?**

కాంతిలో 7 రంగులు (వయొలెట్, ఇండిగో, బ్లూ, గ్రీన్, యెల్లో, ఆరెంజ్, రెడ్) ఉంటాయి. మనం ఇంద్రధనుస్సులో ఈ రంగులను చూస్తాం. ఈ రంగుల్లో ప్రతిదానికీ ఒక తరంగ దైర్ఘ్యం ఉంటుంది. ఇది కాంతి పదార్థంలో ప్రవహించే వేగాన్ని నిర్ణయిస్తుంది. మీరు టార్చ్‌ను వెలిగించాక కాంతి పాల కణాలతో ఢీకొని వాటిని కదిలిస్తుంది. ఈ అణువులు కాంతిని చెల్లా చెదురుగా చేస్తాయి. ఇక్కడ కాంతి తరంగాలు అత్యల్ప తరంగ దైర్ఘ్యం ఉన్న కణాలలో ఎక్కువగా చెదిరిపోతుంది.

టార్చ్ లైట్‌ను గ్లాస్ చివరి నుంచి వెలిగిస్తే గ్లాస్‌లో నీళ్ల పాలు నీలం రంగులో కనిపిస్తాయి. ఎందుకంటే నీలం రంగు తరంగ దైర్ఘ్యం చాలా తక్కువ. కనుక నీలం రంగు చెదిరి పోతుంది. ఎందుకంటే కాంతి ఒక స్వల్ప దూరాన్ని చేరాల్సి ఉంటుంది.

టార్చ్ వెలుగును గ్లాస్ అడుగు నుంచి పంపితే కాంతి ఎక్కువ దూరం వెళ్లాల్సి ఉంటుంది. ఇందులో ఎక్కువ తరంగదైర్ఘ్యం కలిగిన ఎరుపురంగు వ్యాపించి నీళ్ల పాలు ఎరుపు రంగులో కనిపిస్తాయి.

## తెలుసుకోండి :

**పగలు ఆకాశం నీలంగా, సూర్యాస్తమయం వేళలో ఆరెంజ్ రంగులో ఎందుకు ఉంటుంది?**

సూర్యకాంతి ఏడు రంగుల్లో ఉంటుంది. కాని అన్ని రంగులు కలిపితే తెలుపు కనిపిస్తుంది. సూర్యకాంతి భూవాతావరణాన్ని తాకే కోణాన్ని బట్టి ఆకాశం రంగు వేర్వేరు సమయాల్లో వేర్వేరుగా మారు తుంది. మేఘాలు లేని రోజున ఆకాశం నీలం రంగులో కనిపిస్తుంది. ఎందుకంటే గాలి కణాలు సూర్యుని నీలం కాంతి రంగును ఎరుపు కాంతి రంగు కంటే ఎక్కువగా వ్యాపింప చేస్తాయి. సూర్యోదయం, సూర్యాస్తమయం సమయంలో నీలం ప్రకాశం చాలా ఎక్కువగా తొలగి పోయింది. ఎక్కువ శాతం ఎరుపు, పసుపు రంగు మిగిలిపోతుంది. అందుకే ఆకాశం నీలం, ఎరుపు కాంతిలో కనిపిస్తుంది.



Photo credit: pixabay.com/giani-1202

# చుక్కలు కలపండి

బెన్నీ ఎలుగుబంటి, అతని చిన్నారి ఫ్రెండ్ టబ్బీ ఏం చేస్తున్నారో తెలుసుకోవడానికి చుక్కలు కలపండి.






# డాక్టర్ క్రాబ్ తెలివి

కథ ● విద్యా జె.ఎస్

టూత్‌లెస్ షార్క్ ఒక మెరిసే ముత్యపుచిప్ప ముందు నిలబడ్డాడు. అతను తన ప్రతిబింబాన్ని చూసుకుని గట్టిగా ఒకసారి ఊపిరి పీల్చుకుని 'నేను కూడా పర్‌ఫెక్ట్‌గా తయారుకావాలి. అదే నా కోరిక' అన్నాడు. అతను రంగురంగుల చేపలను చూసి ఈర్ష్యపడేవాడు. ఎందుకంటే అవి ఎంతో ఆకర్షణీయంగా, వైబ్రెంట్‌గా, పర్‌ఫెక్ట్‌గా కనిపించేవి. ఆరెంజ్ కలర్‌లో ఉండే క్లౌన్‌ఫిష్ ఒక మూవీ స్టార్. ప్రతి ఒకరు అతని దగ్గరి నుండి ఆటోగ్రాఫ్ తీసుకోవాలని కోరుకుంటారు.

'నేను కూడా క్లౌన్‌ఫిష్ లాగా ఆరెంజ్ కలర్‌లోకి మారిపోవాలని నా కోరిక' ఒక రోజు అకస్మాత్తుగా తన తల్లితో చెప్పాడు.

'ఆరెంజ్? మై డియర్ బాయ్, ఆరెంజ్ షార్క్ గురించి నీకు ఎవరు చెప్పారు' ఆమె నవ్వింది.

'ఆరెంజ్ ఎందుకు?' అని అడిగింది.

'నేను కూడా పర్‌ఫెక్ట్‌గా కావాలనుకుంటున్నాను' టూత్‌లెస్ చెప్పాడు.

'బాబూ, ఆరెంజ్ మన రంగు కాదు. ఈ రంగులో నువ్వు రోగిలాగా కనిపిస్తావు. మనది బూడిద రంగు. నువ్వు బూడిద రంగులో చాలా బాగున్నావు' వాళ్లమ్మ వివరంగా చెప్పింది.

టూత్‌లెస్ ఆలోచించడం మొదలుపెట్టాడు. మూవీ స్టార్స్ పర్‌ఫెక్ట్‌గా కనిపించాల్సి ఉంటుంది. అతను చాలా వ్యాసాలు చదివాడు. చేపలను సినిమా జీవితంలో టెక్నాలజీ సహాయంతో చాలా డిఫరెంట్‌గా తయారుచేస్తారని అతనిలో నమ్మకం కుదిరింది. క్లౌన్ ఫిష్‌కి నిజానికి అంత అందం లేదని, ఆ ఆరెంజ్ కలర్‌తోనే వచ్చిందేమో అనుకున్నాడు.

'అయితే మూవీ స్టార్‌లను కాపీ కొట్టి ఎవరు ఎలా పర్‌ఫెక్ట్‌గా తయారవుతారు' అతను తన చిట్టి చెల్లెలు ఫిన్‌ఫిన్‌ను ఆశ్చర్యంతో అడిగాడు.



పళ్లు, బూడిద రంగు శరీరం విషయంలో ఆలోచించి ఆందోళనకు గురయ్యాడు. ఎప్పటికైనా తాను పర్‌ఫెక్ట్‌గా తయారవుతానా అని విచారించాడు.

అయినా కూడా అతను ఉత్సాహంతో డాక్టర్ క్రాబ్ గుహవైపు ఈదడం మొదలుపెట్టాడు. అతను ఒక గద్దెపై ఒక చిన్నారి క్రాబ్ విశ్రాంతి తీసుకుంటూ ఉండడం చూసాడు. అతను పడుకుని ఉన్నట్లుంది.

'హలో, నేను టూత్‌లెస్‌ను.'

ఎలాంటి జవాబు రాలేదు.

'నా మాట వింటున్నారా డాక్టర్ క్రాబ్. నేను పర్‌ఫెక్ట్‌గా మారాలనుకుంటున్నాను.'

నిశ్శబ్దం ఆవరించింది.

'హలో?' కొద్దిసేపు ఆగి మళ్లీ టూత్‌లెస్ పిలిచాడు.

'రేపు రా' డాక్టర్ క్రాబ్ నిర్లక్ష్యంగా చెప్పాడు.

ఒక పెద్ద శబ్దంతో టూత్‌లెస్ వణికిపోయాడు. అతను ఈదుకుంటూ దూరంగా వెళ్ళిపోయాడు. అతను రెండో రోజు మళ్లీ వచ్చాడు.

'అరే, నువ్వు ఈ విషయంలో సీరియస్‌గా ఉన్నావా లేదా నేను తెలుసుకోదలిచాను. కేవలం సీరియస్‌గా ఉండేవారు మాత్రమే పర్‌ఫెక్ట్ అవుతారు. ఇప్పుడు జాగ్రత్తగా విను. నువ్వు మూడు పనులు పూర్తి చేయాలి' చెప్పాడు.

'మొదటి పని రోజంతా నీ తలపై సముద్ర శైవలాలు ధరించాలి' అన్నాడు.

'కానీ...' టూత్‌లెస్ చెప్పాలనుకున్నాడు.

'కానీ ఏమీ లేదు. ఒకవేళ నువ్వు పర్‌ఫెక్ట్‌గా

ఫిన్‌ఫిన్ దగ్గర ఈ ప్రశ్నకు ఎలాంటి జవాబు లేదు. అందుకే ఆమె కూడా ఒక ప్రశ్న అడిగింది. 'కానీ నువ్వు పర్‌ఫెక్ట్ కావాలని ఎందుకు కోరుకుంటున్నావు?' అని అడిగింది.

'ఎందుకంటే పర్‌ఫెక్ట్ కావడం మంచి విషయం' అతను ఎంతో కూల్‌గా చెప్పాడు.

ఆ తర్వాత అతను తన కజిన్ హేమర్‌హెడ్ షార్క్‌తో 'హమ్మీ, నేను పర్‌ఫెక్ట్ కావాలనుకుంటున్నాను' అని చెప్పాడు.

హమ్మీ ఒక్క క్షణం ఆలోచించాడు. తర్వాత 'పద, వెళదాం డాక్టర్ క్రాబ్ దగ్గరికి. అతని దగ్గర అన్ని సమస్యలకు జవాబులు ఉన్నాయి. అతను ఈ మధ్య ఒక పుస్తకం రాసాడు. దాని పేరు 'ఎలా సంతోషంగా ఉండాలి'. ఇది బాగా అమ్ముడుపోతున్న పుస్తకం' అని చెప్పాడు.

'నిజంగా? నాకు నమ్మకముంది. ఒక షార్క్‌ను పర్‌ఫెక్ట్ ఎలా తయారుచేస్తారో అతనికి తెలిసే ఉంటుంది.'

డాక్టర్ క్రాబ్ ఒక బిజీ క్రస్టేషియన్. కానీ హమ్మీ అతన్ని కలవడానికి టైమ్ తీసుకున్నాడు.

అపాయింట్‌మెంట్ తీసుకున్న రోజు టూత్‌లెస్ చాలా భయపడిపోయాడు. అతను తన పెద్ద సైజు

కావాలని కోరుకుంటే నేను ఎలా చెబితే అలా చెయ్' డాక్టర్ క్రాబ్ చెప్పాడు.

టూత్‌లెస్ కొన్ని సముద్ర శైవలాలు వెతికి తన తలపైన పెట్టుకున్నాడు. ప్రతి ఒక్కరు నవ్వుతున్నా టూత్‌లెస్ అదేమీ పట్టించుకోలేదు.

మర్నాడు అతను తిరిగి వచ్చినప్పుడు డాక్టర్ క్రాబ్ 'ఒక వేయి ముత్యపు చిప్పలను సేకరించు' అని చెప్పాడు.

టూత్‌లెస్ సముద్రంలో ముత్యపు చిప్పలను వెతకడంలో పైకి కిందకు మునకలు వేస్తూ వెళ్లాడు. అతను అలసిపోయాడు. కానీ అతను పని పూర్తి చేసాడు. అతను తన పెద్ద నోట్లో ముత్యపు చిప్పలను కుప్పగా పోసుకుని వాటిని డాక్టర్ క్రాబ్ గుహ దగ్గరికి తీసుకువెళ్ళి అక్కడ పెట్టాడు.

'హుమ్మ్... వీటిని లెక్కించడానికి నేను సహాయకులను పిలవాలి. ఇందులో శంఖాలు కూడా ఉన్నాయా? అవి నాకు చాలా ఇష్టం' డాక్టర్ క్రాబ్ చెప్పాడు.

డాక్టర్ అతను చేసిన పనిని ప్రశంసిస్తూ ఒక్క మాట కూడా చెప్పలేదు. ఈ కారణంగా టూత్‌లెస్ కొంచెం నిరాశపడ్డాడు. కానీ అతను శాంతంగానే ఉన్నాడు.

'నువ్వు చేయాల్సిన తర్వాతి పని నీకు ఉన్న మొత్తం మూర్ఖులు, పనిలేని స్నేహితులందరికి బాయ్ బాయ్ చెప్పాలి. పర్‌ఫెక్ట్ జీవి కేవలం పర్‌ఫెక్ట్ జీవితోనే ఉండాలి. నాలాంటి పర్‌ఫెక్ట్ జీవిలాగా.'

'కానీ మీరు ఒంటరిగా ఉంటారు' భయం భయంగా చెప్పాడు టూత్‌లెస్. తను తన అమాయక మిత్రులను, కుటుంబం విడిచి ఉండలేడు.'

'ప్రతి ఒక్కరు పర్‌ఫెక్ట్‌గా తయారుకాలేరు. సముద్రంలో ఒక్కోసారి పైకి లేదా కిందికి వెళ్ళి వారు ఒంటరితనం భరించాల్సి వస్తుంది. కానీ నేనైతే పర్‌ఫెక్ట్.'

టూత్‌లెస్ తల ఊపాడు. అతను పర్‌ఫెక్ట్ కావడం అంటే కేవలం ఒక ఐడియా కాదని అనుకున్నాడు.

'మంచిది, నేను నా స్నేహితులను వదిలేస్తాను' అతను చెప్పాడు.

'మంచిది, నువ్వు అక్కడికి వెళ్లు. అక్కడ నీ ప్రమాణ పత్రం ఉంది' డాక్టర్ క్రాబ్ అతన్ని పర్‌ఫెక్ట్ క్లబ్‌లోకి పిలిచాడు.

టూత్‌లెస్ మూడు దశలు దాటేసాడు. ఇప్పుడతను పూర్తిగా పర్‌ఫెక్ట్. అలా ప్రమాణ పత్రం అతనికి ఇచ్చారు.

టూత్‌లెస్ తన ప్రమాణపత్రం తీసాడు. తొందరగా తన ఇంటివైపు దారి తీసాడు. ఇప్పుడు అతను పర్‌ఫెక్ట్ అను భవం పొందుతున్నాడు. ఎందుకంటే అతని దగ్గర ప్రమాణ పత్రం ఉంది. కానీ సంతోషం లేదు. ఒక నెల గడిచిపోయింది.

'ఎందుకు నువ్వు ఉదాసీనంగా ఉన్నావ్' ఒక రోజు ఫిన్‌ఫిన్ అడిగింది.

'నేను ఉదాసీనంగా లేను. ఇప్పుడు నేను



పర్ఫెక్ట్. ఏంటీ, నీకు నాలో తేడా కనిపించడం లేదా' అతను మొరటుగా జవాబిచ్చాడు.

అతని చిట్టి చెల్లెలుకు తన అన్నయ్య ఇంత నిరాశలో, మౌనంగా ఉండడం నచ్చలేదు. ఆమె తన అన్నయ్య పొడుపు కథలు వినిపిస్తాడని అనుకుంది. అతని పళ్లు చాలా పెద్దగా ఎందుకు ఉన్నాయి? అవసరంలో ఇతరులను ఆదుకునేందుకు విచారపడసాగింది. ఇప్పుడు ఇద్దరు కలిసి ఆడుకోవడం లేదు. కానీ టూత్లెస్కి ఇప్పుడు తాను పర్ఫెక్ట్ అనిపిస్తోంది. అతను ఇప్పుడు పనికిమాలిన వారితో వ్యవహరించలేడు.




అతని స్నేహితులు కూడా అతన్ని బయటకు వచ్చి ఆడుకోమని చెప్పి అలసిపోయారు. 'నువ్వు ఏదీ కూడా చేయలేనప్పుడు ఇలా పర్ఫెక్ట్ కావడంలో అర్థం ఏముంది' హమ్మీ తన రెక్కలు ఆడిస్తూ చెప్పాడు. టూత్లెస్కి ఇప్పుడు ఇదంతా వినడం కష్టంగా మారిపోయింది. ఒక రోజు అతను డాక్టర్ క్రాబ్ దగ్గరికి మళ్లీ వెళ్లాడు.

'ఇప్పుడెలా నడుస్తోంది నీది?' అడిగాడు డాక్టర్ క్రాబ్.

'పర్ఫెక్ట్ కావడం వృథా అని నాకనిపిస్తోంది.'

'నువ్వు ఎంతో అందమైన షార్క్వి. ఆ మొత్తం వస్తువులను చూడు. అదంతా నువ్వు చేసిందే. నువ్వుశైవలాలతో రోజంతా ఈదావు. అయినప్పటికీ ప్రజలు నవ్వారు. కానీ నువ్వు వాళ్లేమనుకుంటారోనని పట్టించుకోలేదు'

'నువ్వు ఒక వేయి ముత్యపు చిప్పలను సేకరించావు. ఎవరితో ఎలాంటి గొడవ పెట్టుకునే వృథా పని చేయకుండా నువ్వు కనిపించావు. తమ పనిలో తాము నిమగ్నమై పోవాలని నువ్వు చేసి చూపించావు.'

టూత్లెస్ కళ్లు మెరిసాయి.

'మూడవ పనిలో నువ్వు స్నేహితులు, కుటుంబం లేకుండా జీవితానికి ఎలాంటి విలువ లేదని చూసావు. అప్పుడు పర్ఫెక్ట్గా తయారయ్యే ప్రయత్నం దేనికి? నువ్వు నీలాగే ఉండచ్చు కదా?' డాక్టర్ క్రాబ్ కళ్లలో మెరుపు కనిపించింది.

టూత్లెస్ సంతోషంతో తన ఇంటివైపు ఈదడం మొదలుపెట్టాడు. తనకు ఏమీ తెలియకపోయినా అతను ఎవరిని కలిసినా అందరితో అమాయకంగా కలిసిపోయాడు. అతను జెల్లీ ఫిష్ను ఆట పట్టించాడు. హమ్మీతో పాటు ఊయలలూగాడు. తన చెల్లెలు ఫిన్ఫిన్తో కలిసి ఆడుకున్నాడు. చిన్నారి కుందేలుకు స్కూలు నుండి వచ్చే సమయంలో ఇంటికి చేరుకోవడానికి సహాయం చేసాడు.

'నేను టూత్లెస్ షార్క్గా ఉంటేనే సంతోషంగా ఉంటాను' అతను తన చెల్లెలితో చెప్పాడు. సంతోషంతో అతని చెల్లెలు చప్పట్లు కొట్టింది.

'నిన్ను నీలాగే మేము ఇష్టపడతాం' అందరు చెప్పారు. నిజానికి డాక్టర్ క్రాబ్ చాలా పెద్ద తెలివైన క్రాబ్. ఎందుకంటే అతను టూత్లెస్ను మార్చేసాడు. ●

# దారి చూపండి

డిసెంబర్ 11న అంతర్జాతీయ పర్వతారోహణ దినం. సుశాంత్ చాలా పైకి వెళ్లాలి. కానీ దారి మర్చిపోయాడు. అతను సరస్సు, గుహ, వాటర్ ఫాల్ దాటుకుంటూ పైకి వెళ్లడానికి దారి చూపండి.









జవాబులు చివరి పేజీలో చూడండి.


చీకూ
చిత్ర కథ ● దాసు


ఈ రోజు సొసైటీ మొత్తం శుభ్రం చేద్దాం.


సరే పద.


అందరూ శుభ్రం చేయడం ప్రారంభించారు.
ఇక్కడ దున్నపోతు నిద్ర పోతోంది. ఇక్కడ శుభ్రం చేయడానికి దీన్ని నిద్రలేపాలి.


చీకూ దాన్ని లేపడానికి దాని తోకను లాగాడు.
లే, మేము ఇక్కడ శుభ్రం చేయాలి.
!


దున్నపోతు తోకను లేపి, చీకూను విసిరేసింది.
పారిపో, నేను ఇక్కడి నుంచి వెళ్లను.


ఔచ్, నేనిక ఎవరి తోనూ గొడవ పడను.


నాతో రా, నేను నీకు బామ్ రాస్తాను.


రెండో రోజు చీకూ, మీకూలు కూర్చున్నారు. అప్పుడే అక్కడికి దున్నపోతు వచ్చింది.
మీరిద్దరు ఇక్కడ కూర్చున్నారేంటి? వెళ్లి శుభ్రం చేయవచ్చు కదా?


అది మా ఇష్టం. మేము ఇక్కడే కూర్చుంటాం.


మీరిద్దరు ఇక్కడ కూర్చోవడం చూసి నాకు కోపం వస్తోంది. వెళ్ళి సొసైటీలో శుభ్రం చేయండి.


చీకూ చెత్త కుప్పపై పడ్డాడు.
ఔచ్, నేను ఎవరితోనూ గొడవ పడొద్దని అను కున్నాను. కానీ ఇప్పుడు దీనికి గుణపాఠం చెప్పాల్సిందే.


నేనిక కాసేపు రెస్ట్ తీసుకుంటాను.


చీకూ కొంచెం చెత్త తీసి దున్నపోతుపై వేసాడు.
నేనిక్కడ శుభ్రం చేసాను.


నీకెంత ధైర్యం నాపైనే చెత్త వేస్తావా?


నేనిక నీకు గుణపాఠం చెబుతాను.


ముందు నువ్వు నన్ను పట్టుకో.


నేను నీ కాళ్ళూ చేతులు విరగ్గొడతాను. నువ్వు పారిపోకుండా ఉంటావు.


చీకూ ఒక చిన్న వంతెన నుంచి కందకాన్ని దాటుతున్నాడు.


దున్నపోతు కూడా వంతెన పైకి ఎక్కింది. వంతెన విరిగిపోయి, దున్నపోతు కందకంలో పడిపోయింది.
ఔచ్! నేను ఈ మురికి నీళ్లలో పడ్డాను. ఎవరైనా నన్ను కాపాడండి.



# జియా విల్లీ ఆటలు

కథ ● సుధా విజయ్

9 ఏళ్ల జియాకు కబుర్లంటే చాలా ఇష్టం. తన తాతయ్య త్వరలో తమ దగ్గరికి వస్తున్నాడని చాలా సంతోషంగా ఉంది.

'తాతయ్య మా కోసం ఏం తీసుకొస్తున్నాడోనని నాకెంతో ఉత్సాహంగా ఉంది' జియా మమ్మీతో చెప్పింది. 'గతసారి ఆయన ఒక బుట్ట నిండా మామిడిపళ్ళు తెచ్చాడు. అంతకుముందు నా కోసం సైకిల్ తెచ్చాడు' జియా తాతయ్య కానుకలను గుర్తు చేసుకుంది.

'మరైతే నువ్వు తాతయ్య కోసం ఎదురుచూస్తున్నావా? లేక ఆయన తెచ్చే బహుమతుల కోసమా?' మమ్మీ నవ్వుతూ అడిగింది.

'రెండింటి కోసం' జియా చిరునవ్వుతో చెప్పింది.

అప్పుడే ఆమెకు మెయిన్‌డోర్ తెరిచిన శబ్దం వినిపించింది. అక్కడ తన నాన్న, తాతయ్య నిల్చున్నారు. జియా సంతోషంగా అరిచి పరుగెత్తి

తాతయ్యను చుట్టేసుకుంది. ఆమె తాతయ్యను ఎన్నో ప్రశ్నలు అడిగేసింది.

'మీరు ఆలస్యంగా వచ్చారేంటి? గ్రానీ ఎందుకు రాలేదు? పెంపుడు మేక ఎలా ఉంది?' అంది.

అప్పుడే మమ్మీ వచ్చి 'జియా నిశ్శబ్దంగా ఉండు. తాతయ్యను విశ్రాంతి తీసుకోనివ్వు. ప్రయాణంలో అలసిపోయి ఉంటారు' అంది.

జియా అయిష్టంగానే మౌనం వహించింది.

గంట తర్వాత తాతయ్య జియాను పిలిచి నిదానంగా ఆమె ప్రశ్నలన్నింటికీ బదులిచ్చాడు. తర్వాత బ్యాగ్ తెరిచి ఒక పెద్ద బాక్స్ తీసాడు. అందులో బేసన్‌లడ్డూలున్నాయి. గ్రానీ తయారుచేసిన జార్ కూడా ఉంది.



'వాహ్, ఈ లడ్డూలు చాలా రుచికరంగా ఉన్నాయి' లడ్డూ తింటూ చెప్పింది జియా.

'నీ కోసం నా దగ్గర స్పెషల్ కానుక ఉంది' కనుబొమ్మలు ఎగరేస్తూ చెప్పాడు తాతయ్య.

జియా బ్యాగు మొత్తం వెతికింది. కానీ కనపడలేదు. 'అది బయట ఉంది' అన్నాడు తాతయ్య.

'థాంక్యూ తాతయ్యా నా కోసం ఇంతకంటే మంచి గిఫ్ట్ ఏముంది' మేకను నిమురుతూ చెప్పింది జియా.

'కానీ నువ్వు దీనిపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాలి. ముందుగా దీనికి ఏదైనా పేరు పెట్టు' అడిగాడు తాతయ్య.

'దీన్ని మనం విల్లీ అని పిలుద్దాం' అంది జియా.

తర్వాత తాతయ్య జియాకు మేకకు ఇవ్వాల్సిన ఆహారపానీయాల గురించి చెప్పాడు. వారం తర్వాత తాతయ్య తిరిగి వెళ్ళిపోయాడు. విల్లీ జియాతో బాగా కలిసిపోయింది. ఇప్పుడు వారిద్దరూ వేరుగా ఉండలేరు.

అధిక గారాబం కారణంగా విల్లీ తుంటరిదైపోయింది. పొరుగువారి తోటలో దూరి గడ్డి, పూలు, కూరగాయలు తినేసేది. పొరుగువారు ఫిర్యాదు చేయటం మొదలుపెట్టారు. కుటుంబంలో అందరినీ పిలిచి సమావేశం పెట్టారు.

అప్పుడు మమ్మీ ' మేము దానికి అన్ని రకాల ఆహారం పెడుతున్నాము. అయినా అది అటుఇటు వెళ్ళి ఆహారం దొంగతనంగా తింటోంది. విల్లీకి దురాశ ఎక్కువ' అంది.

డాడీ జియాతో 'నువ్వే దాని సంరక్షకురాలివి. సమస్యకు నువ్వే పరిష్కారం చెప్పు' అంది.

జియా కాసేపు ఆలోచించి సన్నగా నవ్వేసింది. తన గదిలోకి వెళ్ళి చిన్న గంటతో బయటికొచ్చింది.

'మమ్మీ, డాడీ, మనం ఈ గంటను విల్లీ మెడలో



కట్టేద్దాం. గంట శబ్దం విని అందరూ దాన్ని తరిమేస్తుంటారు' అంది జియా.

వెంటనే గంటను దాని మెడలో కట్టేసారు. ఇప్పుడది ఎవరి గార్డెన్‌లోకి వెళ్ళినా శబ్దం విన్న వెంటనే వారొచ్చి తరిమేసేవారు.

విల్లీ ఈ విషయాలతో విసిగిపోయింది. ఇప్పుడు దానికి ఘోష్‌గారి టమాటాలు, సలీమ్ ఇంట్లో తియ్యటి క్యారెట్లు, శర్మగారి రుచికరమైన గుమ్మడి ఆకులు తినడానికి దొరకటం లేదు. తన మెడలో గంట చూసుకుని అన్ని సమస్యలకు ఇదే కారణం అనుకుంది. ఎలాగైనా దీన్ని వదిలించుకోవాలనుకుంది.

అది మొత్తం శక్తితో మెడను విదిలించటం మొదలుపెట్టింది. తల కూడా అటు ఇటు గట్టిగా రుద్దుతూ ఉంది. కానీ ఏమీ ఫలితం లేదు. ఇప్పటికీ మెడలో గంట వేలాడుతూనే ఉంది.

'నేను పండ్ల తోటలోకి వెళ్తాను. అక్కడ కూలీలు చాలామంది ఉంటారు. వారి సహాయంతో ఈ గంట తెంచేసుకుంటాను' అనుకుంది విల్లీ.

అది తోట, కొండ ఉన్న ప్రదేశానికి వెళ్లింది. తోటకు నలువైపులా కంచె తీగెలు వేసారు. అది తీగవైపు తల దూర్చి గంట పగలగొట్టే ప్రయత్నం చేసింది. కానీ తీగలో తల ఇరుక్కుపోయింది. అది బయటికి రావటం కష్టమైంది.

'కాపాడండి... కాపాడండి...' అంటూ కేకలేసింది. కానీ ఎవరికీ వినిపించట్లేదు.

కాసేపటికి చీకటి పడిపోయింది. అక్కడ తోట దగ్గరే అడవి ఉంది. విల్లీకి చాలా భయమేసింది.

'ఇదేంటి మూర్ఖమైన పని చేసాను' ఆందోళనగా కేకలేసింది. కాసేపటికి ఎవరో తన పేరుతో అరుస్తుండటం దానికి వినిపించింది.

'విల్లీ... విల్లీ...'

విల్లీ తలాడించగానే గంట మోగసాగింది. ఆ శబ్దం విని జియా, ఆమె తండ్రి దాని దగ్గరికి చేరారు.

'అది అక్కడ ఇరుక్కుపోయింది' జియా కేకలేసింది. తర్వాత జియా, ఆమె తండ్రి కలిసి నిదానంగా దాని తలను బయటికి తీసారు.

ఇంటికెళ్లాక జియా గంటను తీసేసి విల్లీకి మందు రాసింది. గంట వల్లే విల్లీకి ఇలా జరిగిందని ఆమెకు అర్థమైంది. విల్లీని వదలిపెట్టేయమని చెప్పింది మమ్మీ.

జియా మమ్మీని హత్తుకుని 'విల్లీకి ఇంకొక్క అవకాశం ఇవ్వొచ్చు కదా?' అంది.

విల్లీ తన తోక ఆడించి మమ్మీ చీరకు అతుక్కుపోయింది. మళ్లీ చిరునవ్వుతో 'ఇదే చివరి అవకాశం' అంది.

జియా, విల్లీలు సంతోషంగా గంతులేసారు. ఇద్దరూ బయట తిరిగేందుకు వెళ్లారు. మరోసారి విల్లీ మెడలో గంట కట్టారు. విల్లీ తన ఇంట్లోనే సంతోషంగా గడపసాగింది. ●




మేలుకో
వినియోగదారుడా
మేలుకో
ఎక్స్పైరీ డేట్
చూడటం మరవద్దు


రోహిత్ నువ్వు ఇంత వేగంగా ఎక్కడికి వెళ్తున్నావు?


మీకూ, నేను మమ్మీతో పక్కనున్న దుకాణానికి స్నాక్స్, బిస్కెట్స్ కొనడానికి వెళ్తున్నాను.


రోహిత్ , మరైతే దీనికి ఇంత తొందర, హడావిడి చేయాల్సిన అవసరం ఏమిటి?


అరే మీకూ, అక్కడ పదార్థాలపై భారీ డిస్కౌంట్ ఇస్తున్నారు. అందుకే డిస్కౌంట్ లాభం వదులు కోవద్దని త్వరత్వరగా వెళ్తున్నాను.
ఎలాంటి డిస్కౌంట్ రోహిత్?


మీకూ నా ఫ్రెండ్స్ ఏం చెప్పారంటే స్నాక్స్, బిస్కెట్స్ మార్కెట్‌లో 50-60 రూపాయలకు లభిస్తే, ఇక్కడ కేవలం 20-30 రూపాయలకే దొరుకుతున్నాయి. కేవలం స్నాక్స్, బిస్కెట్స్ కాదు, ఇతర పదార్థాలు కూడా చాలా తగ్గింపు ధరలకు లభిస్తున్నాయి.


సరే రోహిత్, పదార్థాలు కొనేటప్పుడు జాగ్రత్త.


మీకూ, జాగ్రత్త! అంటున్నావు ఎందుకు?


ఎప్పుడైనా దుకాణదారులు చౌకగా పదార్థాలు అమ్ముతున్నట్లయితే వాటిపై లేబుల్‌ను బాగా చదివాకే కొనుగోలు చేయాలి. ఎందుకంటే ఆ పదార్థాలు ఎక్స్పైర్డ్ అయ్యి ఉండొచ్చు. దుకాణదారులు తమకు నష్టం రాకుండా కాపాడుకునేందుకు హడావిడిగా తగ్గింపు ధరలకు అమ్మేస్తుంటారు.


మీకూ, ఈ ఎక్స్‌పైరీ డేట్ అంటే ఏమిటి?


రోహిత్, ఆహారపానీయాలు, ఔషధాలు, ఇతర అనేక పదార్థాలపై ఎక్స్‌పైరీ డేట్ ముద్రించి ఉంటుంది. దీని అర్థం ఏమిటంటే ఎక్స్‌పైరీ డేట్ ముందు వరకు ఆ పదార్థాన్ని వాడటం మంచిది. ఆ తర్వాత వాడితే అవి ఆరోగ్యంపై చెడు ప్రభావం చూపిస్తాయి.


రోహిత్, మరో విషయం ఏమిటంటే, ఆహార పానీయాల లేబుల్‌పై బెస్ట్ బిఫోర్, యూజ్ బై డేట్ లేదా ఎక్స్‌పైరీ డేట్ రాసి ఉంటాయి.
మీకూ ఇప్పుడు నాకు ఎంతో ముఖ్యమైన విషయం చెప్పాడు.


బాగుంది మీకూ, మరైతే కేవలం ఆహార పానీయాలు, ఔషధాల మీదే బెస్ట్ బి ఫోర్ లేదా ఎక్స్‌పైరీ డేట్ రాసి ఉంటుందా?


లేదు రోహిత్, క్రెడిట్ కార్డ్, పాస్‌పోర్ట్ మొదలైన వాటి మీద కూడా ఎక్స్‌పైరీ డేట్ ఉంటుంది. ఆ తర్వాత వాటికి విలువ ఉండదు.


ఇప్పుడు అర్థమైందా రోహిత్.
అవును. మీకూ.


ఇప్పుడు నువ్వు స్నాక్స్, బిస్కెట్స్ మొదలైనవి ఎక్స్‌పైరీ డేట్ చూసాకే కొనాలి. ఒకవేళ దుకాణదారుడు ఎక్స్‌పైర్డ్ డేట్ ఉన్న పదార్థాలు అమ్ము తున్నట్లయితే నువ్వు హెల్ప్‌లైన్ నెంబర్ 1800-11-4000కి ఫోన్ చేయాలి లేదా 9868686868 నెంబర్‌కు ఎస్ఎమ్ఎస్/వాట్సప్ చేయొచ్చు.


రోహిత్ మీకూ మాటలు విని ఏదైనా పదార్థం కొనే ముందు తప్పకుండా ఎక్స్‌పైరీ డేట్ చూడటం అలవాటు చేసుకున్నాడు. అంతేగాక దీనిపై మమ్మీ, డాడీ, ఫ్రెండ్స్‌కు కూడా అవగాహన కల్పించాడు.



# ఏమిటో చెప్పండి



# మీకెన్ని తెలుసు?

1. నన్ను పెంచుకోలేరు,
రెండు కాళ్లున్న పక్షిని,
నేను ఎగరలేను,
కానీ ఈదగలను.

2. నేను చిన్నగా, వెంట్రుకలతో ఉంటాను,
నాకు స్వేచ్ఛగా ఎగరడం ఇష్టం,
నేను ఇంటి బయట ఉంటాను,
ఇంట్లో కూడా ఉంటాను.

3. నేను అధిక బరువుతో ఉంటాను,
నేను నాజూకు వస్తువులు తింటాను,
నాది తెల్ల రంగు ఉన్ని ఉన్న కోటు,
చల్లని వాతావరణంలో ఉంటాను.

4. నేను చిన్న వాన్నయినా, గట్టివాన్ని,
నాకిష్టమైన స్థలం టేబుల్,
నాకు ఉదయం, సాయంత్రం ఇష్టం,
కారణం అప్పుడే నా అవసరముంటుంది.

1. మన దేశంలో ఏ నగరాన్ని 'పింక్ సిటీ'గా పిలుస్తారు?
(క) గురువయ్యూరు
(ఖ) అలెప్పి
(గ) జైపూర్
(ఘ) గుహవటి

2. ప్రపంచంలో అత్యంత 'పెద్ద' పక్షి ఏది?
(క) గరుడ
(ఖ) ఉష్ట్రపక్షి
(గ) గద్ద
(ఘ) డేగ

3. ప్రపంచంలో అత్యంత 'చిన్న' దేశం ఏది?
(క) వాటికన్ సిటీ
(ఖ) లక్సంబర్గ్
(గ) వియత్నాం
(ఘ) న్యూజిలాండ్

4. ప్రపంచంలో అత్యంత 'పాపులర్' క్రీడ ఏది?
(క) ఫుట్‌బాల్
(ఖ) మల్ల యుద్ధం
(గ) కుస్తీ
(ఘ) క్రికెట్

---

జవాబులు ( ఏమిటో చెప్పండి) :
1. పెంగ్విన్ 2. ఎలుక 3. ధ్రువపు ఎలుగుబంటి 4. టీ కప్పు

జవాబులు ( మీకెన్ని తెలుసు) :
1. గ, 2. ఖ, 3. క, 4. క.

# హార్న్‌బిల్ ఎక్కడ ఉంది?

హార్న్‌బిల్ ఫెస్టివల్‌ను నాగాల్యాండ్‌లో డిసెంబర్ 1 నుంచి 10 వరకు జరుపుకుంటారు. చిత్రంలో దాగున్న హార్న్‌బిల్ ఉడెన్ కార్వింగ్స్‌ను కనిపెట్టండి.



జవాబులు చివరి పేజీలో చూడండి.

# మోనాలిసా

కథ ● రిచా ఛిపోలికా



'అక్కా, అక్కా, నువ్వేం చేస్తున్నావు?' క్రిష్ తన అక్కను అడిగాడు.

'నేను మోనాలిసా గురించి చదువుతున్నాను' అని అక్క చెప్పింది.

'మోనాలిసా ఎవరు?'

'మోనాలిసా ఓ పెయింటింగ్ పేరు'

'నేను కూడా మోనాలిసా గురించి తెలుసుకోవాలనుకుంటున్నాను. ఆమె ఎవరు? పెయింటింగ్ ఎవరు వేసారు? నాక్కూడా చెప్పు అక్కా' క్రిష్ ఉత్సాహంగా అడిగాడు.

'సరే, కాస్త ఓపిగ్గా ఉండు. మోనాలిసా ప్రపంచ ప్రసిద్ధ పెయింటింగ్. 'మోనాలిసా' ఒక ఇటాలియన్ పదం. దానర్థం 'మై లేడీ'. లియోనార్డో డావిన్సీ ఒక పెయింటర్. అతనే ఈ పెయింటింగ్ వేసాడు. అతను ఏప్రిల్ 15, 1452న ఇటలీలోని విన్సీ నగరంలో జన్మించాడు. అందుకే అతని పేరులోనూ విన్సీ ఉంది.

'కానీ అక్కా, మోనాలిసా ఎవరు?' అడిగాడు క్రిష్.

'నిజానికి లియోనార్డో పెయింటింగ్‌లో ఉన్న స్త్రీ ఎవరో చెప్పలేదు. కొందరు సైంటిస్టులు ఆ ఫోటో మేరీ (జీసస్ తల్లి) పెయింటింగ్ అని అంచనా వేసారు. అది అతని తల్లి పెయింటింగ్ అని మరికొందరు చెప్పారు. ఇంకొందరు ఆమె లియోనార్డో ఫ్రెండ్ భార్య లిజా డేల్ గ్లోకొండో వేసిన పెయింటింగ్ అని, దాన్ని తర్వాత కొన్ని మార్పులు చేసి 'మోనాలిసా' అని పేరు పెట్టారని అన్నారు'

'అక్కా, లియోనార్డో ఈ పెయింటింగ్ ఎప్పుడు వేసారు?' అడిగాడు క్రిష్.

'దీన్ని 1506 నుంచి 1519 మధ్య వేసారు. అతను పెయింటింగ్ వేయడం ప్రారంభించిన సమయానికి అతని వయసు 51 ఏళ్లు. దీంతోపాటు మరో ఆసక్తికరమైన విషయం కూడా ఉంది' చెప్పింది అక్క.

'అదేంటి?' క్రిష్ అడిగాడు.

'మోనాలిసాను పేపర్ లేదా బట్టపై వేయలేదు. దాన్ని చెక్కముక్కపై వేసారు. ఈ రకమైన చెక్కల్ని ఇప్పుడు స్కేట్‌బోర్డ్స్ తయారుచేయడంలో వాడుతున్నారు.'

'అక్కా, ఈ పెయింటింగ్ ప్రత్యేకత ఏంటి?' అడిగాడు క్రిష్.

'ఒకవేళ ఈ పెయింటింగ్‌ను నువ్వు వివిధ కోణాల్లోంచి చూస్తే ఈ పెయింటింగ్‌లో ఉన్న స్త్రీ చిరునవ్వు విభిన్నంగా కనిపిస్తుంది. లియోనార్డో ఇందుకోసం ప్రత్యేక టెక్నాలజీని వాడారు. దాని పేరు 'సుఫోమాట్'. ఈ టెక్నాలజీలో స్పష్టమైన రేఖను కాకుండా, పొగమూరినట్లున్న లేదా అస్పష్టమైన రేఖలను వాడి వేసారు' చెప్పింది అక్క.

'అది చాలా కష్టమైన పని కదా అక్కా' ఆశ్చర్యంగా అడిగాడు క్రిష్.

'అవును. అది చాలా కష్టమైనది. కానీ లియోనార్డో అందంగా దాన్ని పూర్తి చేసాడు. అతను ఇందులో వాడిన రంగుల మందం 40 మైక్రోమీటర్ అంటే ఒక వెంట్రుక కంటే ఎక్కువ పలుచగా ఉంది' చెప్పింది అక్క.

'లియోనార్డో మెజీషియనా ఏంటి?' క్రిష్ అడిగాడు.

'లేదు. అతనొక కళాకారుడు.'

'ఇది అతనికి ఇష్టమైన పెయింటింగ్ అయ్యుంటుంది.'

'అవును. అతని అన్ని పెయింటింగ్స్‌లో 'మోనాలిసా' అతని ఫేవరెట్ పెయింటింగ్. అతను అన్ని చోట్లకు ఈ పెయింటింగ్‌ను తీసుకుని వెళ్లేవాడు.'

'ఇది ఖరీదైన పెయింటింగా అక్కా?' అడిగారు క్రిష్.

'అవును క్రిష్. డిసెంబర్ 14, 1962న దీని ధర 100 మిలియన్ డాలర్లు. అంటే 680 కోట్ల రూపాయలు. ఇప్పుడు దీని ధర 790 మిలియన్ డాలర్లు అంటే 5,380 కోట్లు' చెప్పింది అక్క.

'అంత ధరా? ఇప్పుడీ పెయింటింగ్ ఎక్కడ ఉంది?' అడిగాడు క్రిష్.

'ప్రస్తుతం ఈ పెయింటింగ్‌ను ప్యారిస్‌లోని లూవర్ మ్యూజియంలో ఉంచారు. లూవర్ మ్యూజియంలో ఈ పెయింటింగ్ కోసం ఒక ప్రత్యేక గదిని తయారుచేసారు. పెయింటింగ్ పాడవకుండా రూం టెంపరేచర్‌ను ఉంచారు. దాన్ని ఒక బుల్లెట్ ప్రూఫ్ గ్లాస్ లోపల పెట్టారు. ఎందుకంటే 1951లో ఓ వ్యక్తి, ఈ పెయింటింగ్‌పైకి రాయి విసిరాడు. ఆ కారణంగా

SONAL & SUMIT



దానిపై స్థిరమైన గుర్తు ఏర్పడి ఉంది' చెప్పింది అక్క.

'ఇది అద్భుతమైన పెయింటింగ్. నేనిప్పుడు నా ఫ్రెండ్స్‌తోనూ మోనాలిసా గురించి చెబుతాను' అని చెప్పి క్రిష్ అక్కడి నుంచి వెళ్లిపోయాడు. ●

# డ్రీమ్ క్యాచర్

## స్మార్ట్

ఇంట్లోనే డ్రీమ్ క్యాచర్ రూపొందించి, సరదా చేసుకోండి.

### మీకు కావలసినవి :

వైర్ లూప్, దారం, శంఖం, ఆల్చిప్పలు, రెక్కలు, గమ్, రిబ్బన్, చెమ్కీ, కత్తెర.



### ఇలా చేయండి :



1. ఒక వైర్‌లూప్ తీసుకుని 5 సెంటీ మీటర్ల త్రిభుజం కొలతతో ఒక వృత్తం గీయండి. వైర్‌కు నలువైపులా దారాన్ని పూర్తిగా కవర్ అయ్యేలా చుట్టండి.



2. లూప్ (ఉచ్చు)లో ఫ్రేమ్‌పై ఒక బిందువు దగ్గర రిబ్బన్ కట్టండి. ఈ రిబ్బన్ హుక్కులా పని చేస్తుంది.




3. ఫ్రేమ్‌పై ఆరు బిందువులు పెట్టండి. ఒక బిందువు నుంచి మరో బిందువుకు దూరం సమానంగా చిత్రంలో చూపినట్లు ఉండాలి.




4. ఒక పొడవైన రిబ్బన్ తీసుకుని, దాన్ని బిందువు ఎ, బి, సి,ల మధ్య కట్టండి.




5. తర్వాత బిందువులు 'బి', 'సి'ల మధ్య, 'సి', 'డి'ల మధ్య అలాగే 'డి' నుంచి 'ఇ' కి, 'ఇ' నుంచి 'ఎఫ్' వరకు ఆ తర్వాత చివర్లో, 'ఎఫ్' నుంచి 'ఎ' కి కట్టండి. మీకు ఒక షట్భుజాకార ఆకృతి వస్తుంది.




6. బిందువు ఎ, బి, ల మధ్య రిబ్బన్ కట్టేయండి. బిందువుల మధ్య లూప్ ఉండాలి.



7. షట్భుజంలోని ప్రతి భుజం కేంద్రం నుంచి రిబ్బన్‌ను ఇలాగే కడుతూ వెళ్లండి. ఒక అంతర్గత షట్భుజం తయారుచేయండి.



8. అంతర్గత షట్భుజంలోని భుజాల కేంద్రం వద్ద రిబ్బన్ కట్టి చిన్న చిన్న త్రిభుజాలు చేయండి.



9. చివర్ల మధ్య చిన్న వృత్తం మిగలకుండా పూర్తిగా కట్టేయండి. లోపలి వృత్తంపై ముడి వేయండి. అదనపు రిబ్బన్‌ను కట్ చేయండి.



10. లూప్ అడుగు భాగంలో కొంచెం పొడవైన రిబ్బన్ కట్టండి, దాన్ని మెలితిప్పి పిలకలా కట్టేయండి.



11. గమ్‌తో ఆల్చిప్పలు, రెక్కలను రిబ్బన్లపై అతికించండి.

అమెరికాలో ఉండే ఔజిబ్వా తెగలో డ్రీమ్ క్యాచర్ కల్పిత కథను నమ్ముతారు. ఒక డ్రీమ్ క్యాచర్‌ను బెడ్‌రూమ్‌లో వేలాడదీసి, ఇది గాలితో అది కలలను పట్టేస్తుందని చెబుతారు. చెడు కలలు వలలో ఇరుక్కుపోయి ఉదయం సూర్యరశ్మిలో కాలి పోతాయంటారు. మంచి కలలు గదిలో నిద్రించే వ్యక్తి దగ్గర రెక్కలతో తిరుగుతాయని చెబుతారు.



మీ ఇంట్లో దీన్ని స్వయంగా తయారుచేసేందుకు ప్రయత్నించండి. మీ ప్రతిభను మా అడ్రసుకు పంపించండి writetochampak@delhipress.in లేదా ఒక ఫోటో తీసి +919619587613 నెంబర్‌కు పంపించండి.

# పరిష్కరించండి

శ్రేయ స్కూల్ ట్రిప్‌కు నైనిటాల్ వెళ్లడానికి బ్యాగు సర్దుకుంటోంది. ఆమెకు అవసరమైన వస్తువులను టిక్ చేయండి.




జవాబులు చివరి పేజీలో చూడండి.

# విత్తనాలు గుర్తించండి

కింది చిత్రంలోని విత్తనాలు ఏ పళ్లవో చెప్పండి.



1 ____________



2 ____________



3 ____________



4 ____________



5 ____________

# పదాలు వెతకండి

1) దు - టి
2) - పీ
3) సా - లు
4) స్వె-ర్
5) - జులు
6) మ - ర్
7) - కెట్

కింద ఇచ్చిన గళ్లలో చలి కాలానికి అవసరమైన వస్తువుల జాబితాను కనిపెట్టండి.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కు | శా | టి | మ | ఫ | పి | టో | లు | గా | జు | ంర్ |
| మ | దు | టి | పి | జు | మ | గ్లౌ | జు | లు | ట | స్వె |
| ర్ | ప్ప | పో | వా | జా | ట్ | శా | లు | పి | లు | కె |
| శా | టి | శా | రు | కె | పి | దు | వా | శా | మ | త్ |
| వా | మ | ర్ | ఫ్ల | ట్ | క్సు | సా | క్సు | లు | సాఖ | మ్ |
| లు | మ | ఫ్ల | ర్ | వ | స్వె | ఫ్ల | ర్ | మ | టో | టి |
| ర్ | జు | వ | కె | జా | ట్ | ర | టు | గో | జ | ప |
| ట | లు | ర్ | స్వె | ట్ట | ర్ | గా | కె | ట | పా | దు |
| పి | పా | టా | లు | సా | ప | డూ | ట్ | టో | పీ | లు |
| డు | ర్ | ట | వా | క్సు | టి | సా | వ | లు | గా | వ |
| టో | ర్ | ట | దు | వా | ప్ప | గ్లౌ | లు | జు | టి | శా |

జవాబులు చివరి పేజీలో చూడండి.



# అవార్డు

కథ ● ఎస్.వరలక్ష్మి

ఆ రోజు క్లాసులో టీచర్ 'నాలుగు రోజుల తర్వాత మన స్కూలులో ఒక మోనోలాగ్ పోటీ జరగబోతోంది. ఒక విద్యార్థి ఆగకుండా ఒక విషయం గురించి మాట్లాడాలి. మన క్లాసులోని పిల్లలు అవార్డు గెలుచుకోవాలి. స్టూడెంట్స్, ఇప్పుడు ఈ పోటీలో ఎవరు పాల్గొంటారో నాకు చెప్పండి?' అని అడిగింది.

టీచర్ విద్యార్థుల ముఖాలవైపు చూసి చిరునవ్వు నవ్వింది. ఎవ్వరూ తమ ఇష్టంతో ఏదీ చెప్పలేకపోయారు. రితేష్ తన ముందు కూర్చున్న ఫ్రెండ్ అభయ్‌ను మోచేత్తో పొడుస్తూ 'నీ పేరు నేను చెప్పనా' అని అన్నాడు. అభయ్ భగ్గున మండిపోయాడు.

'నీకు ఇంత ధైర్యమా' గుసగుసగా అన్నాడు. రితేష్ నోరు మూసుకుని నవ్వాడు. తన చేయిని పైకెత్తాడు. టీచర్ ఇది చూసి సంతోషించింది. 'వెరీగుడ్ రితేష్. నేను మన క్లాసులో నుండి ఎవరో ఒకరు పాల్గొనాలని ఆశిస్తున్నాను. నువ్వు మిగిలిన పిల్లలందరికీ మార్గదర్శనం చేయాలి' అని అంది.

రితేష్ నిలబడ్డాడు. సంకోచిస్తూ 'లేదు మేడమ్. నేను కాదు. కానీ అభయ్ ఈ పోటీలో పాల్గొనాలనుకుంటున్నాడు. కానీ ఇతను ఎంత సిగ్గరి అంటే స్వయంగా ఏదీ చెప్పలేడు' అన్నాడు.

ఇలా చెప్పి అతను అభయ్‌వైపు చూసాడు. అభయ్ నిర్ఘాంతపోయాడు.

టీచర్ అభయ్‌వైపు చూసి 'ఇది చాలా మంచి విషయం. అభయ్ నిన్ను చూస్తే నాకు గర్వంగా ఉంది' అని అంది.

భయంతో అభయ్ నిలబడిపోయాడు. నత్తిగా మాట్లాడుతూ 'లేదు మేడమ్... నేను... అది...' అన్నాడు. కానీ టీచర్ కాగితంపై అతని పేరు రాసుకుంది.

నిస్సహాయుడైన అభయ్‌కి ఇప్పుడు కూర్చోవడం తప్ప మరే దారి లేదు. అతను కోపంతో ఉన్నాడు. కానీ అసహాయ స్థితిని అనుభవిస్తున్నాడు.

టీచర్ ఇప్పుడు మిగిలిన పిల్లలవైపు తిరిగింది. వారితో 'ఇంకెవరైనా ఉన్నారా? నాకు ఇంకో విద్యార్థి కావాలి' అని అంది.



రితేష్ తన నవ్వును ఆపుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. సరిగ్గా అప్పుడే టీచర్ మాట విన్న అభయ్‌కు కూడా ఒక అవకాశం లభించింది.

అభయ్ తన చేయిని పైకెత్తి గట్టిగా చెప్పాడు. 'మేడమ్ రితేష్ కూడా తన పేరు ఇవ్వాలనుకుంటున్నాడు' అన్నాడు.

రితేష్‌కి అలా జరుగుతుందని అనుకోలేదు. టీచర్ 'నువ్వు ఇలా ముందే ఎందుకు చెప్పలేదు రితేష్?' అని అడిగింది.

రితేష్ గాభరా పడిపోయి 'మేడమ్ అభయ్ ఇక్కడ... లేదు... నేను... చేస్తాను...' అన్నాడు.

టీచర్ అతని పేరు కూడా రాసుకుంది. గట్టిగా 'నువ్వు కూడా పాల్గొంటావు రితేష్. అభయ్, రితేష్‌లు కొంచెం మంచి వాళ్లని నాకు నమ్మకముంది. మీరిద్దరు మీమీ విషయాలను ఎంపిక చేసుకోవచ్చు. పోటీ నాలుగు రోజుల తర్వాత జరుగుతుంది' అని చెప్పింది.

బెల్ మోగింది. టీచర్ క్లాసులో నుండి బయటకు వెళ్ళిపోయింది.

'ఇదంతా నీ కారణంగానే జరిగింది' అభయ్ కోపంతో రితేష్‌ని చూస్తూ అన్నాడు.

రితేష్ కూడా అభయ్‌వైపు తిరిగి 'నువ్వు వీళ్లందరి ముందు నన్నెందుకు లాగావు?' అన్నాడు.

అభయ్‌కి కోపం వచ్చింది. 'మరి నువ్వెందుకు ముందుగా అందరిముందు నా పేరు చెప్పావు?' అని అడిగాడు.

'నేను ఆ విషయం ఎన్నడూ ఆలోచించలేదు. స్కూలు పిల్లలందరి ముందు నేను కవిత వినిపిస్తానని ఊహించలేదు' రితేష్ అరుచుకుంటూ లేచాడు.

'నువ్వు కేవలం నేనే కవిత చదవడానికి పుట్టినట్లుగా మాట్లాడుతున్నావు. నేను టీచర్ ముందు ఒక్క మాట కూడా మాట్లాడలేను' అభయ్ తన నవ్వును ఆపుకుంటూ చెప్పాడు.

దీనికి ముందు రితేష్ ఏదో చెప్పబోతుంటే విద్యార్థులంతా చుట్టూ చేరి వారిని అభినందించడం మొదలుపెట్టారు. రితేష్ కూడా చిరునవ్వు నవ్వడం మొదలుపెట్టాడు.

రాత్రి పడుకునే సమయంలో ఇద్దరు ఈ పోటీ జరిగే రోజున ఏం జరుగుతుందోనని కలత చెందారు.

అభయ్ ఈ పోటీ క్యాన్సిల్ అయ్యే విధంగా ఏదైనా సంఘటన జరిగితే, లేకపోతే ఏదైనా వర్షం వచ్చి ఆగితే లేదా ఇలాంటిదేదైనా జరిగితే బాగుండని ఆలోచించాడు.

రితేష్‌కి కూడా నిద్ర పట్టడం లేదు. అతను నిద్రపోదామని ప్రయత్నించినా స్టేజిపై నిలబడి ఉన్న కలలే వస్తున్నాయి. పప్పెట్‌లాగా మళ్లీ మళ్లీ ఒకే మాట పునరావృతమవుతోంది.

నాలుగవ రోజు అభయ్ ఉదాసీనంగా

మారిపోయి రితేష్‌తో 'నువ్వు మోనోలాగ్‌కి రెడీ అయ్యావా?' అని అడిగాడు.

రితేష్ 'నేను ఆ విషయం గురించి చాలా అంశాలు సేకరించాను. నేను మాట్లాడబోయే అంశాలివి. నేను వీటిని స్కూలు నుండి తిరిగి వచ్చిన తర్వాత జ్ఞాపకం చేసుకుంటాను. నువ్వు ఏం చేసావు?' అని అడిగాడు.

అభయ్ విచారంతో 'నువ్వు కనీసం తెలిసిన అంశాలను సేకరించి పెట్టావు. నేను అయితే ఇప్పటివరకు విషయం కూడా ఆలోచించలేదు. నేను ఒకే మాటలో చెప్పే అలాంటి విషయం ఏదైనా ఉందా?' అని అడిగాడు.

రితేష్ పళ్లు ఇకిలిస్తూ 'అవును, విషయం ఉంది. నువ్వే ఒక విషయం' అన్నాడు.

అభయ్ అమాయకత్వంతో 'హు... నేను?' అన్నాడు.

రితేష్ నవ్వి 'అవును. నీ అంతట నువ్వు ఒక్క మాట అయితే చెప్పగలవు. డమ్మీ లేదా మూర్ఖుడినని' అన్నాడు.

ఇలా అని అతను అక్కడి నుండి పరుగు అందుకున్నాడు. అభయ్ కూడా పట్టుకోవడానికి అతని వెనకాల పరుగెత్తాడు. కానీ రితేష్ ఎంత వేగంగా పరుగెత్తాడంటే అభయ్ అతన్ని పట్టుకోలేకపోయాడు.

రితేష్ తన విషయాన్ని జ్ఞాపకం చేసుకోవడంలో రాత్రంతా గడిపితే అభయ్ మాత్రం అతనికి అనారోగ్యం కలగాలని, అప్పుడతను స్కూల్‌కి రాలేడని ప్రార్థన చేస్తూ ఉండిపోయాడు. 5వ రోజు పోటీ జరిగే సమయానికి ముందే టీచర్ వచ్చి 'మీరిద్దరు పోటీలో పాల్గొనడానికి సిద్ధంగా ఉన్నారని నాకు నమ్మకం ఉంది. మీ ఇద్దరిలో



ఎవరు అవార్డు గెలుస్తారు' అని అడిగింది.

ఇద్దరు బలవంతపు చిరునవ్వు నవ్వారు. టీచర్ వారిపై నమ్మకముంచి వెళ్ళిపోయింది.

పిల్లలు స్టేజికి సమీపంలో నిలబడ్డారు. తమ పేర్లు వినడానికి ఎదురుచూస్తున్నారు.

అభయ్ గొణుకున్నాడు. 'నా పేరు తప్పకుండా మరిచిపోతారు. నాకు పూర్తి నమ్మకముంది' అనుకున్నాడు.

రితేష్ అతన్ని ఉడికిస్తూ 'అలా గనక జరిగితే నేను వారికి రిమైండ్ చేస్తాను' అన్నాడు.

ఆ తర్వాత అతను అభయ్‌ని నాలుక బయటపెట్టి వెక్కిరించాడు.

అభయ్ కూడా అతన్ని వెక్కిరించాడు.

సమయం గడుస్తున్న కొద్దీ ఇద్దరిలో ఆందోళన పెరడగం మొదలైంది.

సరిగ్గా అప్పుడే అభయ్ పేరు ప్రకటించారు. అతని ముఖం వాడిపోయింది.

అతను బిక్కుబిక్కుమంటూ స్టేజిపైకి వెళ్లాడు.

ఒక్క క్షణం అభయ్ నాలుగువైపుల చూసాడు. అందరు అతన్నే చూస్తూ ఉన్నారు. అతని మెదడు పూర్తిగా ఖాళీ అయిపోయింది. ఏం మాట్లాడాలో అతనికి అర్థం కాలేదు. అందరు ఎంతో నమ్మకంతో అతన్ని చూస్తున్నారు.

చెప్పాల్సింది ఏమిటో తనకు తెలుసు. కానీ అతను తన విషయాన్నే మరిచిపోయాడు. పిల్లల అసహనం పెరిగిపోయింది.

విద్యార్థులు అరవడం మొదలుపెట్టారు 'కొంచెం చెప్పు' అని అంటున్నారు.

ఏమీ చెప్పని అభయ్ సమయం చాలా గడిచిపోయింది. అందుకే అతను స్టేజి నుండి కిందకు దిగేసాడు.

ఆ తర్వాత రితేష్ పేరు పిలిచారు. రితేష్ స్టేజిపైకి వచ్చాడు. స్పాట్‌లైట్ కింద నిలబడ్డాడు.

అతను ఆత్మవిశ్వాసంతో చిరునవ్వు నవ్వాడు. తర్వాత అందరివైపు చూసాడు. అతను కవితాపఠనం మొదలుపెడతాడని అందరూ ఆలోచిస్తున్నారు. కానీ అలా జరగలేదు. అతను కూడా స్టేజిపై నుండి దిగేసాడు. స్టేజి బయట వాళ్ల టీచర్ వారిని కలిసింది.

ఇద్దరూ ఇబ్బందుల్లో పడ్డారు. ఒకరినొకరు చూసుకోలేక ముఖాలు తప్పించుకుంటున్నారు.

టీచర్ ఆశ్చర్యంతో వారిని 'మీ ఇద్దరికీ ఏమైంది? ఇద్దరు ఏమీ చెప్పలేకపోయారు? ముందుగా మీరు రెడీ కాలేదా? మీరిద్దరు మా పేరు చెడగొట్టారు?' అని అంది.

అభయ్ లేని నవ్వును తెచ్చుకుని నవ్వుతూ 'మేడమ్, నిజానికి వింతగా చూసే వారందరికీ వ్యతిరేకంగా ఇలా శాంతంగా ఉండాలన్నది నా మోనోలాగ్. దీన్ని నేను శక్తివంతమైన పద్ధతిలో అమలు చేసి చూపించాను' అని చెప్పాడు.

రితేష్ 'మేడమ్ నేను అందుకే ఏమీ మాట్లాడలేదు. ఎందుకంటే నాకన్నా ముందు ఒక వ్యక్తి మాట్లాడు తున్నప్పుడు ఇతరులు నా జుట్టు లాగడం మొదలుపెట్టారు. స్టూడెంట్, టీచర్‌లకు బట్టతలలు రావాలని నేను కోరుకోలేదు. అందుకే నేను నా అవార్డును వదిలేసాను' అన్నాడు.

టీచర్ వాళ్ల మాటలు విని నిర్ఘాంతపోయింది.

ఆమె తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు 'ఈ అవార్డు నాకే రావలసింది. ఎందుకంటే వారిని నేనే ఎంపిక చేసాను' అని ఆలోచించింది. ●



Sachin Pandit






వేదాంత్ షా, 7 సంవత్సరాలు,
డోంబివలీ



అథర్వ్ అభిజీత్ కుల్‌కర్ణి,
13 సంవత్సరాలు, గాంధీనగర్

## నిజం

జూన్ నెల మాకు మంచి మంచి విషయాలను జ్ఞాపకం చేస్తుంది. నేను నా స్నేహితుడిని 'మిస్టర్ కూల్' అని పిలుస్తాను. వర్షం రాగానే నేను, మా తమ్ముడు బాధపడతాం. ఎందుకంటే మేము ఇక్కడ అక్కడ ఆడుకోలేం. జూన్ నెలలో మేము పెద్దగా చదువుకోవాల్సిన పని కూడా ఉండదు. ప్రజలు చికెన్, ప్రాన్స్ తింటారు. వర్షాకాలంలో మెరుపులు, వాటి శబ్దాలతో పైకప్పు వరకు అదురుతుంది. ట్రాఫిక్ జామ్ అవుతుంది. దాంతో మేమంతా ఆందోళనకు గురవుతాము.

సామ్యారాజ్ బెనర్జీ, 14 సంవత్సరాలు,
కోల్‌కతా

## శబ్దం

శబ్దాలు చాలా ఉన్నాయి. కొన్ని శబ్దాలు గొప్పవి. కొన్ని తీయగా ఉంటాయి. కొన్ని శబ్దాలతో ఇబ్బందులు కూడా ఏర్పడతాయి. శబ్దాలను ఎలా ఉపయోగించాలో మీకు తెలిసి ఉండాలి. అప్పుడప్పుడు శబ్దాల్లో దుఃఖం నిండి ఉంటుంది. కానీ వాటిని రెండోసారి ఎలా మంచి శబ్దాలతో నింపాలో మీకు తెలిసి ఉండాలి.

అనన్య అధికారి, 12 సంవత్సరాలు,
రుద్రపూర్,



హాస్య అశేష్ పటేల్,
9 సంవత్సరాలు, అహ్మదాబాద్



శౌర్యాంగ్ భనేర్,
11 సంవత్సరాలు, వడోదర

## ఏపిజె అబ్దుల్ కలాం

డా॥ ఏపిజె అబ్దుల్ కలాం (2002 నుండి 2007 వరకు) మన దేశ 11వ రాష్ట్రపతి. ప్రజలు అతను ఉన్న కాలంలో ఎంతో ప్రేమతో ఆదరించారు. ఎందుకంటే నిజానికి ఆయన సాధారణ ప్రజల రాష్ట్రపతి. రాష్ట్రపతిగా ఎన్నుకోవడానికి ముందే ఆయనను సైన్స్‌లో గొప్ప పనులు చేసినందుకు 'భారతరత్న'తో సత్కరించారు. ఆయన తన ఆత్మకథ 'వింగ్స్ ఆఫ్ ఫైర్'లో ఒక కొడుకు, విద్యార్థి, సైంటిస్టు, నాయకుడి రూపంలో చేసిన పనులను వర్ణించారు.

వి.కౌసల్య, 14 సంవత్సరాలు, పుదుచ్చేరి



రోష్ని, 14 సంవత్సరాలు, లుథియానా



శుభ మిశ్రా, 11 సంవత్సరాలు, జబల్‌పూర్

## భారతీయ పండుగలు

భారతీయ పండుగలు ఎంతో బాగుంటాయి. ఎంతో రంగులమయంగా ఉంటాయి. కానీ దీపావళి రోజు జాగ్రత్తగా ఉండడం అవసరం. సంక్రాంతి పండుగ రోజున మనం సూర్య భగవానుడిని పూజిస్తాం. హోలీ అయితే రంగుల పండుగ. ఈ పండుగను ప్రేమతో జరుపు కుంటారు. ప్రజలు మొత్తం శత్రుత్వాన్ని మరిచిపోయి పరస్పరం కలిసి రంగులతో ఆడుకుంటారు. పరస్పరం ఆలింగనం చేసుకుంటారు. పండుగల్లోనే ప్రజలు తమ కుటుంబ సభ్యులందరితో, స్నేహితులతో కలుస్తారు. మనం పండుగల మాధ్యమంతోనే పరస్పరం చక్కగా కలిసి ఉంటాం.

గంతవ్య మాలవీయ, 16 సంవత్సరాలు, భోపాల్

ఈ నెల క్యాప్షన్ కాంటెస్ట్‌లో పాల్గొనడానికి www.facebook.com/Champak Magazine పై లాగిన్ అవ్వండి. విజేతలు 'చంపక్' పత్రికలో తమ పేరు, ఫోటోను చూసుకోవచ్చు.

*8 సంవత్సరాల 'చంపక్' పాఠకుడు ఆద్విక్ చటర్జీ కోల్‌కతా నుండి మనకు రావణ్ బుక్ మార్క్ తయారుచేసి పంపించాడు.*



మీరు రాసిన కథలు, పొడుపు కథలు, జోకులు మీ పేరు, వయసు, అడ్రసు, ఫోన్ నెంబరుతో మాకు పంపించండి:

'చంపక్', ఢిల్లీ ప్రెస్, ఎ-4, శ్రీరాం ఇండస్ట్రియల్ ఎస్టేట్, వడాలా, ముంబై-400031

writetochampak@delhipress.in SMS: 9619587613

www.facebook.com/ChampakMagazine

http://www.youtube.com/ChampakSciQ

# తాతగారు, అంతర్జాతీయ స్వచ్ఛంద సేవకుల దినోత్సవం

కథ ● వివేక్ చక్రవర్తి
















వెంటనే వారి పనితో ప్రభావితమైన ఇతరులు కూడా వాలంటీర్లుగా వారికి వారుగా సహాయం చేయటం మొదలుపెట్టారు. వారందరి సమష్టి కృషి వల్ల బీచ్ శుభ్రమైపోయింది.
మీకు తెలుసా, ఇది ప్రభుత్వ ప్రమేయం లేకుండా చేసిన అతిపెద్ద పరిశుభ్రతా కార్యక్రమం. అఫ్రోజ్‌షా, హర్‌వంశ్ మాథుర్‌లకు యూఎన్ 'ఛాంపియన్స్ ఆఫ్ ది ఎర్త్' అవార్డ్ ఇచ్చింది.


నేటికీ ప్రతి ఆదివారం 50-100 మంది స్వచ్ఛంద సేవకులు (వాలంటీర్లు) వార్సోవా బీచ్‌ని శుభ్రం చేస్తుంటారు. ఇప్పుడు వార్సోవా బీచ్ చాలా పరిశుభ్రంగా ఉంటుంది. అఫ్రోజ్‌షా లక్ష్యం ఏమిటంటే ముంబైలోని ఇతర బీచ్‌లన్నీ శుభ్రం చేయాలి.
అవును. మనం ఇతరులను కూడా ఈ పరిశుభ్రతా ఉద్యమంలో భాగ స్వాములయ్యేందుకు ప్రేరేపించవచ్చు.
వారు అంత పొడవైన బీచ్‌ని శుభ్రం చేయగలిగి నప్పుడు మనం కూడా ఈ పార్కును శుభ్రం చేయగలం.


తాతగారూ, మేము మా ఫ్రెండ్స్‌ను కూడా వాలంటీర్లుగా మారాలని చెబుతాం. ఇలా మనకు వారి సహాయం అందుతుంది. వారు కూడా ఈ పార్కులోకి వస్తుంటారు కదా.
అవును, ఈ పార్కు పరిశుభ్రత మన ఇరుగు పొరుగున ఉండేవారికి ఒక గిఫ్ట్‌లాంటిది. ఎందుకంటే డిసెంబర్ 5న అంతర్జాతీయ స్వచ్ఛందసేవకుల దినోత్సవం జరుపుతారు.
SONAL & SUMIT
రియా, రాహుల్‌లు సరేనంటూ తలూపారు.



# అద్దంలో దేవుడు

కథ ● ఇలికా ప్రియ

ఆ రోజు చీకూ చాలా సంతోషంగా ఉన్నాడు. అతని చేతిలో పూజాద్రవ్యాల పళ్లెం ఉంది. అందులో 500 రూపాయల నోట్లు రెండు ఉన్నాయి.

మీకూ ఎలుక అతన్ని చూసి 'నువ్వు హారతి పళ్ళెం, రూపాయలు తీసుకుని ఎక్కడికి వెళుతున్నావు?' అని అడిగాడు.

'నా మనసులోని కోరిక తీరిపోయింది. నా కొడుకు బాగుపడ్డాడు. బాబా మనోభీష్టాలన్నీ తీర్చాడు. బాబా నా కొడుకును బాగు చేసాడు. అలాంటప్పుడు నేను 500 రూపాయలేమిటి, 5000 రూపాయలు కూడా ఇవ్వడానికి వెనుకాడను. బాబా చనిపోయే నా కొడుకును రక్షించాడు. అతనికంటే గొప్పవాడు ఇంకెవరూ ఉండరు' అని చెప్పి చీకూ గుడికి వెళ్ళిపోయాడు.

కొన్ని రోజులకు ముందు బేడీ నక్క బాబా వేషం వేసుకుని చంపకవనంలోకి వచ్చాడు. అతను జంతువుల సమస్యలన్నింటికీ జవాబు ఇస్తాడు. పరిష్కరిస్తాడు. బదులుగా జంతువులు అతనికి డబ్బులు సమర్పించు కుంటాయి. బాబా ఆశ్రమంలో ఎప్పుడు చూసినా రద్దీగా ఉంటుంది. చాలా జంతువులు తమ మనసులోని కోరికలను తీర్చుకోవడానికి వచ్చేవి. మరికొన్ని మనసులోని కోరిక తీరిన తర్వాత వచ్చేవి. అతికష్టంమ్మీద చీకూకు నెంబర్ దొరికింది.

'దేవుడు నీ బాధలన్నీ దూరం చేస్తాడు' బేడీ నక్క చెప్పాడు.

'దేవుడు నా మొర ఆలకించడమే లేదు.



ఇప్పుడు నేనేం చేయాలో చెప్పండి. నేను మళ్లీ ఫెయిల్ అయిపోయాను' చీకూకి సరిగ్గా ముందు నిలబడి ఉన్న జంపీ కోతి ఏడుస్తూ చెప్పాడు.

'ఇప్పుడు నువ్వు ఇంకా బాగా కష్టపడాల్సి ఉంది. సరియైన సమయం వచ్చినప్పుడు నీ సమస్య పరిష్కారమవుతుంది' బాబా అతని తలపై పవిత్రమైన చీపురు తిప్పుతూ చెప్పాడు.

తర్వాత బాబా మరో జంతువువైపు చూడటం మొదలుపెట్టాడు. అప్పుడే చీకూ జరిగాడు. అలా జరగ్గానే డమరూ గాడిద ముందుకు వచ్చి 'జయహెూ జయహెూ' అంటూ అరవడం మొదలుపెట్టాడు. 'ఏమైంది డమరూ? నువ్వు చాలా సంతోషంగా కనిపిస్తున్నావు' చీకూ అడిగాడు.

'నేను దేవుణ్ణి చూసాను. నాకు భగవంతుడు లభించాడు. నేను దేవుడి మహిమను చూసాను' అతను నాట్యం చేస్తూ ముందుకు వెళ్లిపోయాడు.

అందరూ ఇది విని ఆశ్చర్యపోయారు. వనంలో ఈ వార్త దావాగ్నిలా విస్తరించింది. డమరూ దేవుడిని చూసాడన్న వార్త గుప్పుమంది.

'ఇదెలా సాధ్యం? భగవంతుడిని ఎలా చూడగలరు?' వనంలోని జంతువులన్నీ ఇది తెలుసుకోవాలన్న ఉత్సుకతతో ఉన్నాయి. అందరు గుమిగూడి డమరూ ఇంటివైపు బయలుదేరారు. 'డమరూ దేవుడిని చూడగలిగినప్పుడు మనమెందుకు చూడలేము?' కొన్ని జంతువులు ఆలోచించాయి.

'డమరూ అన్నా, నువ్వు మాక్కూడా దేవుడిని చూపిస్తావా?' టీటూ సీతాకోకచిలుక విజ్ఞప్తి చేస్తూ అడిగాడు.

'ఎందుకు కాదు? ఎవరైనా దేవుడిని చూడవచ్చు. నేను నీకు ఇప్పుడే చూపిస్తాను' అని చెప్పి డమరూ జేబులో నుండి ఒక అద్దం బయటకు తీసి టీటూకి ఇచ్చాడు.

'నువ్వు ఇందులో దేవుడిని చూడవచ్చు' డమరూ చెప్పాడు. 'కానీ ఇది ఒక అద్దం. ఇందులో మనం కేవలం మన ముఖాన్ని మాత్రమే చూడగలం. భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?' టీటూ సీతాకోకచిలుక అడిగాడు.

చీకూ కూడా అద్దంలోకి తొంగి చూసాడు. అతనికి కూడా దేవుడికి బదులుగా అతని ముఖమే కనిపించింది. డమరూ చీకూ దగ్గరికి రాగానే అద్దంలో అతని ముఖం కూడా కనిపించడం మొదలుపెట్టింది. డమరూ ఎగిరి గంతేస్తూ 'చూడండి, చూడండి ఇప్పుడు ఇద్దరు దేవుళ్ల కనిపిస్తున్నారు' అని అన్నాడు.

'అరే, ఇది నా ముఖమే' చీకూ కోపంతో అన్నాడు.

'ఇది నా ముఖమే అని మీకెలా తెలిసింది?' అక్కడ చేరిన జంతువులన్నీ ఈ మాట విని పగలబడి నవ్వడం మొదలుపెట్టాయి.

అప్పుడు జంపీ కోతి 'అద్దంలో మన ముఖం వైజ్ఞానిక కారణాల వల్ల కనిపిస్తుంది. ఇది కాంతి పరావర్తనం చెందిన కారణంగా జరుగుతుంది. అప్పుడు మన ముఖం అద్దంలో కనిపిస్తుంది. దీన్ని దేవుడు కనిపించడం అనరు' అన్నాడు.

'జంపీ ఇదంతా నీకు తెలిసినప్పుడు మరి

నువ్వు బాబా ముందు ఎందుకు కూర్చుంటావ్?' డమరూ కోపంతో అడిగాడు.

ఆ తర్వాత డమరూ బాబా దగ్గర కూర్చోవడం, కాంతి పరావర్తనం మధ్య ఉన్న సంబంధం తెలుసుకుని అందరూ దిగ్భ్రాంతి చెందారు.

డమరూ గట్టిగా ఒక శ్వాస తీసుకుని 'ఫ్రెండ్స్, ఒక సమయంలో ఎవరికీ ఈ విషయాల గురించి ఏమీ తెలియకపోయేది. కానీ మెల్లమెల్లగా ఈ విషయాలను అద్భుతంగా భావించడం మొదలుపెట్టారు?' చెప్పాడు.

'అవును' చీకూ చెప్పాడు.

'ముందు ఎవరికీ అర్థం కాలేదు. కాంతి పరావర్తనం కారణంగా మన ముఖం అద్దంలో కనిపిస్తుందని. కానీ ఈ రోజు మనకు తెలిసిపోయింది. సైన్స్ మనకు సహాయం చేసింది. కానీ మనం ఇప్పటికీ బాబాల చమత్కారాలపై ఎందుకు గుడ్డినమ్మకం పెట్టుకుంటాం?' 'మేము డమరూ చెప్పింది వింటున్నాం' జంపీ అన్నాడు.

'మనం ఎక్కడైతే వైజ్ఞానిక కారణాలు తెలుసుకుంటామో అక్కడ మనం దేవుడి చమత్కారాన్ని ఒప్పుకోము. కానీ విషయానికి చెందిన వైజ్ఞానిక కారణాలు మనకు తెలియకపోతే అప్పుడు దాన్ని దేవుడి మహిమ అని భావిస్తాం.'

'అందరూ బాబాల దగ్గరికి, ఆలయాలకు వెళుతుంటారు. వారి వలలో పడుతుంటారు. మనం దేవుడిని మొక్కులు కోరుతాం. మన మనోభీష్టాలను తీర్చమని అడుగుతాం. ఆ పని వైజ్ఞానిక కారణాలతో పూర్తయినా కూడా దాన్ని దేవుడి ఆగ్రహంగా లేదా బాబా కృప వల్ల జరిగిందని భావిస్తాం. ఒకవేళ పని పూర్తి కాకపోతే మనం ఇంకా సమయం రానట్లుంది అని అనుకుంటాం. సరియైన సమయం రాగానే బాబా వాటిని తీరుస్తాడని అని అనుకుంటాం.'

డమరూ మాటలు విని అంతా ఆశ్చర్యపోయారు. 'ఇదే నిజం. పనికానీ, కాకపోనీ అందరూ బాబా దగ్గరికి పరుగెత్తి వెళతారు. కానీ వాస్తవానికి ఏ బాబా ఎవరికైనా మంచి ఎలా చేస్తాడు?'

'మనం ఈ మోసాన్ని ఆపాలి' మీకూ చెప్పాడు.

'డమరూ నిజమే చెబుతున్నాడు. డమరూ సైన్స్ వాస్తవాన్ని మన ముందు ఉంచి మన కళ్లు తెరిపించాడు. ఈ రోజు నుండి ఎవరూ కూడా బాబా దగ్గరకు వెళ్లరు. కళ్లు మూసుకుని బాబాను నమ్మరు' అని చీకూ చెప్పాడు.

జంతువులన్నీ ఈ విషయాన్ని ఒప్పుకున్నాయి. అంతా తమ తమ ఇళ్లకు వెళ్లిపోయాయి. ●



SONAL & SUMIT



# మీ ప్రశ్నలకు మేనకా ఆంటీ జవాబులు

మేనకా ఆంటీకి జంతువులన్నా, పక్షులన్నా చాలా ప్రేమ. ఇప్పుడు మీ ప్రశ్నలకు మేనకా ఆంటీ సమాధానాలు చెబుతారు. పక్షులకు, జంతువులకు ఆహారం ఎలా తినిపించాలి? వాటిని ఎలా ప్రేమించాలి? వాటి సంరక్షణ ఎలా చేయాలి? మొదలైన విషయాలు చెబుతారు. ఆమె ఒక పార్లమెంటేరియనే కాదు, గొప్ప పర్యావరణ నిపుణురాలు కూడా!

ప్ర: మా కుక్కకి వెంట్రుకలు ఎందుకు రాలుతాయి?

- అమర్ నాయేగాంధీ, 9 సంవత్సరాలు, జైపూర్

డియర్ అమర్,

జ : తక్కువ మోతాదులో జుట్టు రాలడం కుక్కలతో పాటు ప్రతి స్తన్య జీవుల్లో ఉండే ఒక సాధారణ అల వాటు. చాలా ఎక్కువగా జుట్టు రాలిపోవడమంటే కుక్కకు బాగాలేదని అర్థం. ఇందుకు కుక్క రక్తం, యూరిన్ టెస్ట్ చేయించడం తప్పనిసరి. తెలియకుండా ఎలర్జీతో రోగగ్రస్థమైన కుక్కల్లో తరచుగా ఎక్కువగా జుట్టు రాలుతుంది. ప్రతి రోజూ బ్రష్ చేయించడం, మంచి ఆహారం ఇవ్వడం, సరియైన పాలనతో ఇందులో తగ్గుదల వస్తుంది. సరైన పోషణ కారణంగా రాలిపోయే జుట్టులో తగ్గుదల ఏర్పడుతుంది. ఒక నెలలో ఒక కుక్కను ఒకసారికి మించి స్నానం చేయించకూడదు. కొన్ని జాతుల్లో అయితే ఇంకా తక్కువగా స్నానం చేయిస్తారు. ఎందుకంటే ఇవి ఆరబెట్టుకోవడానికి మరింత జుట్టు రాలుస్తాయి.



ప్ర: నేను పెంచుకోవడానికి ఇటీవలే ఒక తాబేలును తెచ్చుకున్నాను. నేను దాన్ని ఎలా చూసుకోవాలి.

- అవనీశ్ కపాడియా, 6 సంవత్సరాలు, ముంబై

డియర్ అవనీశ్,

జ : చట్టపరంగా ఒక తాబేలును పెంచుకోవడానికి అనుమతి లేదు. టర్టిల్, టార్టాయిస్ ముఖ్యమైన జాతులు.



అవి వేరు వేరు పద్ధతిలో నివసిస్తాయి. తినే పద్ధతి వేరుగా ఉంటుంది. దయచేసి వీటిని పెంపుడు జంతువులా పెట్టుకోకండి.

ఒకవేళ మీరు పెంపుడు జంతువులు, పశుపక్ష్యాదుల గురించి ఏదైనా అడగాలనుకుంటే మీ ప్రశ్నలను మాకు పంపించండి. మీరు అడిగిన ప్రతీ ప్రశ్నకు మేనకా ఆంటీ జవాబు ఇస్తారు.

writetochampak@delhipress.in
www.facebook.com/ChampakMagazine






మీలో రాయగలిగే కళ, ఊహలకు రంగులద్దాలనే కోరిక ఉన్నట్లయితే

# మీరు కూడా పాల్గొనవచ్చు

7




'చంపక్' క్రియేటివ్ చైల్డ్ కాంటెస్ట్ మీ ప్రతిభ, సృజనాత్మకతను ప్రదర్శించేందుకు అతిపెద్ద అపూర్వమైన వేదిక. ఇందులో 600 కంటే ఎక్కువ స్కూళ్ల నుంచి 1,00,000కు పైగా పిల్లలు పాల్గొంటారు. మేము మీ నగరంలో మీ స్కూలుకు వస్తున్నాము.

**అర్హత :** 3వ తరగతి నుంచి 8వ తరగతి పిల్లలు.

**సామగ్రి :** రాయటానికి, రంగులు వేయడానికి సామగ్రి సొంతంగా మీరే తెచ్చుకోవాలి. (డ్రాయింగ్ కోసం కాగితం షీట్ అందిస్తాం.)

మొదటి రౌండ్‌లోని మంచి డ్రాయింగ్స్‌ను తర్వాతి రౌండ్‌కు ఎంపిక చేస్తాం. మీ స్టోరీ బాగున్నట్లయితే దాన్ని 'చంపక్'లో కూడా ప్రచురిస్తాం. మరైతే సిద్ధమవ్వండి...

### ఎలా పాల్గొనాలి?

జాతీయ స్థాయిలో జరిగే ఈ పోటీలో పాల్గొనేందుకు మీ స్కూల్ టీచర్‌ను సంప్రదించండి.

### నేరుగా పాల్గొనేందుకు :

'చంపక్' మీ స్కూల్‌కి రాకపోయినా నేరుగా పోటీలో పాల్గొనవచ్చు.

- ఒక ఏ 4 సైజు కాగితం తీసుకోండి.
- 'స్కూలు ఆసక్తికరమైనది' విషయంపై పోస్టర్ రూపొందించండి.
- కాగితం వెనుక ఇదే విషయంపై ఒక కథ రాయండి.
- కాగితంపై మీ పేరు, వయసు, తరగతి, అడ్రసు, మొబైల్ నెంబర్ తప్పక రాయండి.
- మీ టీచర్ లేదా తల్లిదండ్రుల సంతకం తీసుకుని కింద ఇచ్చిన అడ్రసుకు పంపించండి.



పూర్తి వివరాల కోసం సంప్రదించండి: 011 - 41398888 మాకు ఈ అడ్రసుకు రాయండి : ఎ-4, శ్రీరాం ఇండస్ట్రియల్ ఎస్టేట్, జీడీ అంబేద్కర్ మార్గ్, వడాలా, ముంబై-400031.
ఇ మెయిల్ : writetochampak@delhipress.in ఫేస్‌బుక్‌లో చూడండి www.facebook.com/Champakmagazine

'చంపక్' ఎంతో గర్వంగా 'చంపక్' క్రియేటివ్ చైల్డ్ కాంటెస్ట్ సీజన్ - 7 ఫలితాలు ప్రకటిస్తోంది.

సీజన్ 7




### నానమ్మ శిక్షణ

మా నానమ్మ మాకు మూఢ నమ్మకాలకు దూరంగా ఉండాలని నేర్పించింది. ఆమె బోరింగ్ విషయాలను కూడా ఆసక్తికరంగా మారుస్తుంది. కథల రూపంలో నానమ్మ మాకు ఇతిహాసాలు, పెద్ద కవితలను కూడా చెబుతుంది. ఆమె ఏ విషయమైనా సరే అద్భుతంగా తయారు చేస్తుంది. మా నానమ్మ లెక్కల విషయంలోనూ ఆడుతూ పాడుతూ చెబుతుంది. నానమ్మ 'మన కళ్లను మూసేయండి. మీకు నచ్చిన అంశం గురించి ఆలోచించండి' అని చెప్పేది. ఆమె ఒక గొప్ప కథకురాలు. ఆమె మాకు ప్రతి విషయాన్నీ ప్రేమించాలని చెప్పింది.

అనుషా శుక్లా, 7 సంవత్సరాలు, జబల్‌పూర్



శ్రేయ మెహతా, 8 సంవత్సరాలు, ముంబై



అనన్య తివారీ, 6 సంవత్సరాలు, న్యూఢిల్లీ

పోటీలో పాల్గొన్న వారందరికీ 'చంపక్' తరఫున ప్రేమాభినందనలు. మరైతే పెన్ను, రంగులు అందుకోండి. మీ కళను మా వద్దకు పంపించండి. పోటీలో పాల్గొనడానికి ఈ సంచికలో ప్రచురించిన 'చంపక్ క్రియేటివ్ చైల్డ్ కాంటెస్ట్' ప్రకటన చదవండి. త్వరపడండి.

### మంచి మనిషి

నేను ఒక సాధారణ అబ్బాయిని. నేను ఆట బొమ్మలతో ఆడుకుంటాను. నేను దయామయుడిగా మారాలని ఆలోచిస్తాను. ఇతరులకు సహాయం చేయాలని అనుకుంటాను. మంచి చేయడం కోసం నేను కష్టపడి చదువుతాను. నేను ఏదైనా చేయగలను అని అనిపిస్తుంది. నేను పెద్దయ్యాక ఒక మంచి మనిషిగా అయ్యే ప్రయత్నం చేస్తాను.

ఆర్యా శ్రీధర్, 7 సంవత్సరాలు, బెంగళూరు

ఈ నెల వైల్డ్ కార్డ్ ప్రవేశానికి విషయాలు :

- ఇప్పటివరకు అన్నింటికంటే మంచి బహుమతి.
- నాకు నచ్చిన ఆటగాడు.
- నాకు చలికాలం ఇష్టం ఎందుకంటే...
- ఒక ఫిల్మ్ తీసే విషయం.

మీ రచనలను ఏ4 సైజు కాగితంపై రాసి పంపించండి.



మా చిరునామా : చంపక్, ఢిల్లీ ప్రెస్,
ఎ-4, శ్రీరాం ఇండస్ట్రియల్ ఎస్టేట్, వడాలా, ముంబై-400031.
ఇమెయిల్ : writetochampak@delhipress.in
ఫేస్‌బుక్‌లో చూడండి : www.facebook.com/ChampakMagazine

ఆహార ఫ్యాక్టరీ

టీ రుచి పరిశీలన కేంద్రం




# సరైనవి చెప్పండి

డిసెంబర్ 15న అంతర్జాతీయ 'టీ' దినోత్సవం. కింది వాటిలో సరి కానివి చెప్పండి.

## తప్పులు కనిపెట్టండి

కింది చిత్రంలో 10 తప్పులున్నాయి. మీరు వాటిని వెతికి చెప్పండి?









## మనకు, వాటికి తేడా

***మనుషులుగా మనం వస్తువులను, వ్యక్తులను, స్థలాలను, సంఘటనలను గుర్తుంచుకునే సామర్థ్యం కలిగి ఉంటాం. అలాగే ఉడుతలకి తాము పూడ్చి పెట్టిన గింజలను వెతుక్కోవడానికి ఈ జ్ఞాపక శక్తి సహాయపడుతుంది.***

నేలపై నివసించే ఈ ఉడుతలు సాధారణంగా ఉత్తర, మధ్య అమెరికా సతత హరితారణ్యాలలో నివసిస్తాయి. అవి పెద్ద పెద్ద కొండల్లోని బొరియల్లో లేదా పెద్ద పెద్ద రాళ్ల సందుల్లో రంధ్రాలు చేసుకుని నివసిస్తాయి. చలికాలంలో ఈ ఉడుతలు దాదాపు 5 నుండి 6 నెలల పాటు సుప్తావస్థలో ఉంటాయి. చాలావరకు ఉడుతలకు గింజలను సేకరించడం, వాటిని నిల్వ చేయడం తెలుసు. కానీ చాలాసార్లు అవి తాము గింజలను పూడ్చి పెట్టిన చోటు మరిచిపోతుంటాయి.

ఉడుతలకు కావలసినంత జ్ఞాపక శక్తి ఉంటుంది. భౌగోళిక సమాచారాన్ని గుర్తుకు తెచ్చుకునేంత సామర్థ్యం ఉంటుంది. ఇది వాటి మెదడులో ప్రదేశాల క్రమాన్ని మ్యాప్‌గా తయారు చేసుకోవడంలో సహాయపడుతుంది.

ఈ ప్రాంతాలు అవి గింజలు దాచి పెట్టిన చోటుకి లాండ్‌మార్క్‌గా నిలుస్తాయి. గింజల సేకరణకు వెళ్ళినప్పుడు అవి ముందుగా ఎక్కువసార్లు తిరిగిన ప్రదేశానికి వెళతాయి. అవి తరచుగా తాము దాచిపెట్టిన గింజలు మంచి స్థితిలో ఉన్నాయా లేదా పరీక్షించుకుని మళ్లీ పూడ్చి పెడతాయి. ఈ ప్రక్రియ వల్ల ఎలాంటి ఆహారం దాచి పెట్టాయో, ఎక్కడ, ఏ ప్రాంతంలో ఎక్కువ గింజలు ఉన్నాయో గుర్తు చేసుకోవడానికి తోడ్పడుతుంది.

ఉడుతలు మూడు రకాలుగా బొరియలు తయారుచేస్తాయి. దాచి పెట్టడం, గూడు కట్టడం, సుప్తావస్థలో ఉండటం.



# జోజో జీన్స్

కథ ● మనోజ్ రాయ్

జోజో ఏనుగు ఒకే జత ప్యాంట్ ధరించీ ధరించీ విసిగిపోయాడు. ఒక రోజు అతను హ్యారీ కుందేలు బట్టల షాపుకి వెళ్ళి, తన సమస్య చెప్పాడు.

'నా ప్యాంట్ చాలా తొందరగా లూజు అవుతోంది, చిరిగిపోతుంది కూడా. ఎక్కువ రోజులు మన్నే ప్యాంట్ ఇవ్వు' అని జోజో హ్యారీని అడిగాడు.

హ్యారీ కొద్దిసేపు ఆలోచించి నవ్వుతూ, 'జోజో, నువ్వు జీన్స్ వేసుకోవాలి. అవి సౌకర్యంగా ఉండటంతో పాటూ తొందరగా చిరగవు' అని చెప్పాడు. హ్యారీ తన షాపులో ఎన్నో రకాల దుస్తులు ఉంచాడు. 'ఈ బట్ట చూడు, పలుచగా ఉంటుంది. కానీ కాటన్‌ది. ఇది శరీరంలోని చెమటను కూడా పీల్చుకుంటుంది' చెప్పాడు హ్యారీ.

'అనవసర విషయాలు చెప్పకు. నాకు మంచివి చూపించు. టైం వేస్ట్ చేయకు. నేను ఇంటి తలుపు తెరిచే వచ్చాను. ఎవరైనా నా ఇంట్లో చొరబడితే సమస్య అవుతుంది' చెప్పాడు జోజో.

'అరే, నేను ఈ క్లాత్ అమ్మాలి. అందుకే దాని ప్రత్యేకతలు చెబుతున్నాను. ఇప్పుడు చెప్పు. నీకు ఏ రకం జీన్స్ చూపించాలి? 'స్టోన్ వాష్', 'క్లాసిక్ డెనిమ్' లేదా ప్రింటెడ్ ఉన్నదా?' అడిగాడు హ్యారీ.

'ఆ బ్లూ జీన్స్ చాలా బాగుంది. అదివ్వు. నాకు ఫిట్ అవుతుందో లేదో ట్రయల్ రూమ్‌లో వేసుకుని చూస్తాను' అని చెప్పి జోజో ఆ జీన్స్ తీసుకుని ట్రయల్ రూంకి వెళ్ళాడు.

కొద్దిసేపటి తర్వాత జోజో ట్రయల్ రూం నుంచి నవ్వుతూ బయటకు రావడంతో జోజోకు ఆ జీన్స్ నచ్చిందని హ్యారీకి అర్థమైంది.

జోజో డబ్బులిచ్చి జీన్స్ తీసుకుని షాపు నుంచి బయటకు వచ్చాడు.

జోజో సంతోషంగా ఇంటికి వెళ్లాడు. కానీ ఇంటి పరిస్థితి చూస్తే ఎవరో ఇంట్లోకి వచ్చినట్లు అనిపిస్తోంది.

చాలా రోజులుగా టెరీ ఎలుకకు ఇల్లు లేదు. అతను జోజో ఇల్లు తెరిచి ఉండటంతో లోపలికి వచ్చాడు. బాగా తిని అక్కడే నిద్రపోయాడు. అతను తెలివిగా అన్నీ శుభ్రంగా చేసి పెట్టాడు. దాంతో అతను ఆ ఇంట్లో ఉన్నాడని ఎవరికీ తెలియదు.

ఇప్పుడు జోజో ఎప్పుడూ జీన్స్‌నే వేసుకుంటున్నాడు. తోటలో పని చేసినా లేదా మార్కెట్‌కు వెళ్ళినా అదే వేసుకుంటున్నాడు.





ఆ రోజు చాలా చలిగా ఉంది. జోజో బ్లాంకెట్ కప్పుకుని నిద్రపోతున్నాడు. పాపం టేరీ నేలపై చలికి వణుకుతున్నాడు.

'ఒకవేళ నేను ఇలాగే ఉంటే గడ్డకట్టిపోతాను' అని గొణిగాడు టేరీ.

టేరీ అటూ ఇటూ చూస్తున్నాడు. ఎదురుగా ఉన్న జీన్స్ తనకి వెచ్చదనం ఇస్తుందని అనుకున్నాడు. టేరీ ఆ జీన్స్‌లో ఓ ముక్క కట్ చేసి దాన్ని బ్లాంకెట్‌లాగా చుట్టుకున్నాడు. అతను పొద్దున వరకు హాయిగా నిద్రపోయాడు.

'ఓ ఎలుకా ఇక లే. నీ చావు ఎదురుగా నిలుచుని ఉంది' పొద్దున్నే జోజో అరిచాడు.

టేరీ చెవుల్లో ఆ శబ్దం వినగానే అతను వెంటనే లేచాడు. అతను జోజో చేతిలో కర్ర ఉండటం చూసాడు.

'నువ్వు నాకిష్టమైన జీన్స్‌ను కట్ చేసావు' జోజో కోపంగా టేరీని అడిగాడు.

టేరీకి పారిపోవడానికి ఏ దారీ కనిపించలేదు. జోజో లేవకముందే ఎందుకు పారిపోలేదని తనపై తనకే కోపం వస్తోంది. ఇప్పుడతను ఇరుక్కుపోయాడు.

'నేను ఏదో ఒకటి చేయాలి' అని టేరీ ఆలోచిస్తున్నాడు. అతను నవ్వుతూ జోజోతో 'నువ్వు కోప్పడకు అన్నా, నిజానికి నేనో ఫ్యాషన్ డిజైనర్ని. నేను నీ జీన్స్‌కు కొత్త డిజైన్ చేసాను' టేరీ అతనికి జీన్స్ చూపిస్తూ అన్నాడు.

'ఇదేం డిజైన్? ఇప్పుడు నేను దీన్ని ధరించలేను' కోపంగా అన్నాడు జోజో.

'నువ్వు అనవసరంగా కోప్పడకు. ఈ రోజుల్లో చిరిగిన జీన్స్ ధరించడం ఫ్యాషన్' టేరీ జోజోకు వివరిస్తూ చెప్పాడు.

'సరే. నేనిప్పుడే హ్యారీ షోరూంకి వెళ్తాను. తర్వాతే నిర్ణయం తీసుకుంటాను' కఠినంగా చెప్పాడు జోజో.

జోజో హ్యారీ షోరూంకి వెళ్లాడు. తనతో టేరీ కూడా ఉన్నాడు.

'అరే జోజో, నీ జీన్స్ ఎలా ఉంది?' అడిగాడు హ్యారీ.




'ఇలా చూడు. ఈ ఎలుక నా జీన్స్‌ను ఎలా చేసిందో!' చిరిగిన జీన్స్‌ను హ్యారీకి చూపిస్తూ చెప్పాడు జోజో.

'ఇక నేను చచ్చాను' టేరీ ఆలోచిస్తున్నాడు.

'అరే వావ్! ఇది చాలా మంచి డిజైన్' అని హ్యారీ అనడంతో టేరీకి ప్రాణం లేచొచ్చింది.

'ఇది చాలా బాగుంది. ఈ ఎలుక చాలా తెలివైన వాడిలా కనిపిస్తున్నాడు' హ్యారీ జీన్స్‌ను బాగా చూస్తూ అన్నాడు. జోజో కోపం కూడా కాస్త చల్లబడింది.

'నన్ను క్షమించు టేరీ' టేరీతో చెప్పాడు జోజో.

'జోజో నేను ఏ డిజైనర్‌నూ కాదు. ఆ రోజు రాత్రి నాకు చాలా చలిగా ఉంది. దాంతో...' అంటూ టేరీ విషయమంతా చెప్పాడు. 'నన్ను క్షమించు, నన్ను నేను కాపాడుకోవడానికి అలా చేసాను.'

జోజో మనసు కరిగిపోయింది.

'ఫరవాలేదు టేరీ, నువ్వు నిజం చెప్పి నీ తప్పు ఒప్పుకున్నావు. నువ్వు కావాలనుకుంటే నాతో ఉండవచ్చు' చెప్పాడు జోజో.

'అవును టేరీ, నువ్వు నిజం చెప్పావు. ఒకవేళ నువ్వు నా షాపులో డిజైనర్‌గా పనిచేయాలనుకుంటే నేను నీకు మంచి జీతం ఇస్తాను' చెప్పాడు హ్యారీ.

ఇద్దరి మాటలు విని టేరీ ఎంతో సంతోషించాడు. ●

## జవాబుల పేజి

పేజీ 11 : సోహమ్‌కు సహాయం చేయండి :




పేజీ 23 : దారి చూపండి



పేజీ 33 : హార్న్‌బిల్ ఎక్కడ ఉంది? :



పేజీ 38 : పరిష్కరించండి :



పేజీ 39 : విత్తనాలు గుర్తించండి : (1) మామిడి (2) ఆరెంజ్ (3) తర్బూజా (4) పనస (5) బొప్పాయి

పేజీ 39 : పదాలు వెతకండి :

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కు | శా | టీ | మ | ఫ | పి | టో | లు | గా | జు | ంర్ |
| మ | దు | టీ | పి | జు | మ | గ్లౌ | జు | లు | ట | స్వె |
| ర్ | ప్ప | పో | వా | జా | ట్ | శా | లు | పి | లు | కె |
| శా | టి | శా | రు | కె | పి | దు | వా | శా | మ | త్ |
| వా | మ | ర్ | ఫ్ల | ట్ | క్సు | సా | క్సు | లు | సా | మ్ |
| లు | మ | ఫ్ల | ర్ | వ | స్వె | ఫ్ల | ర్ | మ | టో | టీ |
| ర్ | జు | వ | కె | జా | ట్ | ర | టు | గో | జ | ప |
| ట | లు | ర్ | స్వె | ట్ట | ర్ | గా | కె | ట | పా | దు |
| పి | పా | రా | లు | సా | ప్ | డూ | ట్ | టో | పీ | లు |
| డు | ర్ | ట | వా | క్సు | టి | సా | వ | లు | గా | వ |
| టో | ర్ | ట | దు | వా | ప్ప | గ్లౌ | లు | జు | టి | శా |



# HAPPIER CHILDHOODS GUARANTEED

**If you are looking for magazines that will help spark the imagination of your child, look no further! Dedicated to broadening the horizons of children aged 2-12 years, *Champak*, *Highlights Genies* and *Highlights Champs* are an essential part of your child's reading list.**




**India's largest read children's magazine**




**America's leading children's magazine in now is India!**




**America's leading early childhood magazine is now in India!**

**To subscribe : SMS 8588843436 | Call toll free no.1800 103 8880 | visit www.delhipress.in/subscribe | email subscription@delhipress.in**

(REGISTERED) RNI 32462/77 DL(C)-14/1025/2016-18 P.O. SRT Nagar ND-55. Posting Dt. 02 to 08. Published on 26/11/2017. Pgs. 60

